# కృతజ్ఞత



శ్రీయుత నాజర్ గార్కి సువర్ణ గండపెండేరం బహూకరించి కనకాభిషేకం చేయించి ఘన సన్మాన మొనరించిన భీమవరం రసజ్ఞులకు నా కళాభివందనములు. సన్మానోత్సవ సంచిక ప్రకటించాలనే సంకల్పం ఆహ్వాన సంఘం వారికి కలిగిన వెంటనే అందుకు నన్ను నియమించటం జరిగింది. అప్పగించిన బాధ్యత మహత్తరమైనది. నా తాహతు అందుకు తగదేమోననే భయం నన్ను వేధిస్తుంటె కళాభిజ్ఞులైన పెద్దలు, మిత్రులు ప్రోత్సాహపరచి కార్యక్రమసాధనకు ఆశీర్వదించి, సరైన సహకారం ఎల్లవేళల అందచేశారు. ప్రధానంగా నాట్యకళా సంపాదకులు శ్రీ శ్రీనివాసచక్రవర్తిగారు, ఆంధ్రజ్యోతి ఉపసంపాదకులు ఎల్లోరాగారు, గొడాలి గోపాలరావుగారు అమూల్యమైన సలహాలిచ్చి చక్కని వ్యాసాలందచేసి సన్మానోత్సవ సంచిక ప్రకటించేందుకు ఎంతో తోడ్పడ్డారు. పత్రికను సర్వాంగసుందరంగా ముద్రించుటకు సాహితీ ప్రెస్ వ్యవస్థాపకులు శ్రీ కొల్లా శ్రీకృష్ణారావుగారి కృషి అనిర్వచనీయము. నా శక్తికొలది శ్రమించి సన్మాన సంఘ మప్పగించిన కార్యక్రమాన్ని విజయవంతమయేందుకు నాకు తోడ్పడిన పెద్దలకు, మిత్రులకు మనఃపూర్వక అభివందనాలందచేస్తూ సన్మానోత్సవ సంచికను కళాభిజ్ఞుల ముందుంచుతున్నాను.

సంపాదకుడు:

పురాణం వెంకటసుబ్బారావు

# స్వాగతం

పూజ్యులైన కవిపండిత పెద్దలారా! బుర్రకథ గాయకులారా! సాహిత్య కళాభిమానులార! పిన్నలార! మా ఆహ్వానాన్ని పురస్కరించుకొని బుర్రకథా పితామహ శ్రీయుత నాజరుగారి సన్మానోత్సవమునకు విచ్చేసిన సదస్యులందరికి నా హృదయపూర్వక సుస్వాగత కుసుమాంజలి. అడిగినంతనే మా ఆహ్వానాన్ని అంగీకరించి ఈ సన్మానసభకు అధ్యక్షత వహించటానికి అంగీకరించిన కవికులాలంకార వాఙ్మయోద్ధారక జవ్వాది లక్ష్మయ్య నాయుడుగారికి నా [illegible]నఃపూర్వక కృతజ్ఞతాభి వందనములు. సన్మానోత్సవము [illegible]పురస్సరంగా ఆశీస్సు లందచేసిన కవి, గాయక, [illegible] నమోవాకములు. ఈ కార్యక్రమం [illegible]డ్పడిన మిత్రులకు కళాభి

# పుష్పాంజలి

బుర్రకథా పితామహా గానకళా విశారద శ్రీ నాజరుగారికి గండపెండేర బహూకృతి సందర్భమున సమర్పించిన —

## విద్యా వినయసంపన్నా !

కమనీయ గానసుధా తరంగ భంగాలలో కష్టాలు మరపించి, కన్నులు తెరిపించి కర్షకజనాన్నే కాక కావ్య కళాకోవిదులను కూడా మైమరపింపజేసే నీ ప్రతిభకు నీ గాంధర్వ శోభకు...ఇదే మా పుష్పాంజలి —

## లలిత కళానిధీ !

"గుణాః పూజాస్థానం గుణిషు నచ లింగం నచవయః" అను సూక్తికి ఈ సన్మానమాదర్శనంతము కాగలదని మా విశ్వాసము. కళముందు ప్రకృతి యంతయు మోకరిల్లియే తీరునుగదా ... సుగంధ బంధుర పుష్పరాజమె లతావర్గమునకు చెందిన దను విమర్శన ముందునా ! ... జాతీయధర్మమును స్వాభిమానమును, స్వదేశ సంస్కృతిని ఆబాల గోపాల మానందించునట్లు హృదయాంతరాళాలలో రసము పొంగులువారునట్లు వినదించ గల్గిన నీ సుమధుర గంభీర బంధుర సంగీతముతో తెలుగునాడు మేను పులకరించినది. తెలుగువాని గుండె జలదరించినది. కార్మికు డుత్తేజితుడైనాడు. కర్షకు డుద్వేగమునందినాడు. కవికోకిల గొంతు సింగారించినది. జానపద వీధీ విహంగములు రెక్కలల్లార్చినవి. ప్రకృతియే పరిమళించినది...

## రసరాజశేఖరా !

ప్రాచీన జానపద సౌందర్యము, తెలుగుధీరుల వీరసంపద, ఆంధ్రలోని ఆడబడుచుల అభిమానము శౌర్యలలామల సాహస గరిమ సాహిత్యములో సంగమింపజేసి సంగీతములో రంగరింపచేసి అ . ష, విశేష మనీషులను, అజ్ఞాన తమోమయాంధ్రులను సమముగా సద్బ్రహ్మానంద స్వర్గసీమావధులకు తేలించగల్గిన నీకీ సన్మానము వ్యక్తిగతము గాదు. వక్రమతముగాదు. వాంఛారతముగాదు. జానపద సంగీత సాహిత్య మనోజ్ఞ లక్ష్మికి అపశ్రుతిలేని ఉపశ్రుతి మాత్రము అపహారముగాని ఉపహారము మాత్రము. ఈ నివాళులు ఈ నీరాజనములు కళాలక్ష్మికి కానుకలు మాత్రము...

## అమృతహృదయా !

ఆంతర్య మెరింగిన ఆంధ్రుడవు. తరతమ మరయని తాత్వికుడవు. కళానిధివి, రసధునివి...నీకీ పుష్పాంజలి...సహృచ్ఛిహ్నము...హరిజనమాన్యము ... సురుచిర లావణ్యమునై ప్రకాశించు గాక—

ఆహ్వాన సంఘం.

# నా మాట

యిప్పటికి 19 సంవత్సరాలనుండి అనేక ప్రాచీన గ్రంథాలనుండి పెద్దలనుండి, ప్రజలనుండి, నా స్వానుభవమునుండి తెలుసుకున్న విషయాలను నా సందేహాలను క్లుప్తంగా మీ ముందుంచాను. కొద్దిరోజుల్లో ప్రాచీన యుగాలనుండి "ప్రజలు – కళలు" అన్న పేరుతో యింకా ఎక్కువ వివరాలతో గ్రంథాన్ని వ్రాయాలనుకుంటున్నాను. ఈ నా వ్యాసాన్ని చదివిన పెద్దలు – ప్రముఖులూ – తమ తమ సవిమర్శలను నాకు అందించి నా కృషికి చేయూతనిచ్చి యక్షగాన పునరుద్ధారకులు గాగలరని ఆశిస్తున్నాను. ఈ పత్రికను నా సన్మాన సంచికగా గాక యక్షగాన పునరుద్ధరణకు నాందీగా భావిస్తూనే చేసిన ఈ కృషికి ఇంత ఘన సన్మానము నిచ్చిన శ్రీ గన్నాబత్తులవారి కుటుంబానికి కనకాభిషేకము చేసిన శ్రీ తడవర్తి కృష్ణమూర్తిగారికి గండపెండేరము కాలికి తొడిగిన శ్రీ జవ్వాది లక్ష్మయ్య నాయుడుగారికి డెబ్బది జతల ఎడ్లతో ఊరేగించిన భీమవరం రైతు కూలీలకు, పౌరులకూ నా హృదయపూర్వక అభివందనములు. ఈ పత్రికా నిర్వహణకు అనేకవిధాల కృషిజేసిన శ్రీ పురాణం వెంకటసుబ్బారావుగారికి ప్రేమతో ఉత్తమ సందేశాలను ఆశీస్సులను పంపిన శ్రీయుతులు మల్లంపల్లి సోమశేఖర శర్మ, నార్ల వెంకటేశ్వరరావు గార్ల వంటి ప్రముఖులకు, పెద్దలకు నా హృదయపూర్వక అభివందనాలు అందజేసు కుంటున్నాను.

— నాజర్

# సందేశాలు

అనాదరం పాలయిన బుర్రకథకు మళ్ళీ కొత్త జీవంపోసి దానికి పేరు ప్రఖ్యాతులు తెచ్చినవారిలో శ్రీ నాజర్ మొట్టమొదటివాడు; గొప్ప కళాకుశలుడు. బుర్రకథ చెపుతూవుండగా ఎప్పుడో చూచిన ఆయన మూర్తి ఇప్పటికీ నా కళ్ళకు కట్టినట్టుంది. ఇంకా కళాసేవ చేస్తూ యశస్సు సంపాదించి ఆరోగ్య భాగ్యాలు కలిగి ఆయన వర్థిల్లాలని కోరుతున్నాను.

మల్లంపల్లి సోమశేఖరశర్మ
ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.

శ్రీ నాజర్‌ను సన్మానించడానికి ఒక ఉత్సవాన్ని నిర్వహిస్తున్నందుకు నాకు చాలా సంతోషం. ఈ ఉత్సవం జయప్రదం కాగలదని ఆశిస్తున్నాను.

జానపద కళలను నిలుపుకొనుటలో జాగ్రత్త తీసికోవలసిన అవసరం యెంతైనా ఉంది. మన సమాజం త్వరితగతిని పట్టణాల కెగబ్రాకుతున్నందున ఈ కళలను మొత్తంగా పోగొట్టుకొనే అపాయం యెంతైనా ఉంది. అలాంటి అపాయం రాకుండా ఉండటాని కన్ని చర్యలూ తీసికోవాలి.

ఎ. ఆర్. నార్ల యం. పి.
ఎడిటర్ - ఆంధ్రజ్యోతి

కళాచరిత్రలో యుగకర్త నాజర్ ! కథకసమ్రాట్ నాజర్ ! 'నాజర్ నాజర్'

ఈ యక్షగాన (బుర్రకథ) కళారూపాన్ని ఇంక ఇంక మహోన్నతస్థాయికి శ్రీ నాజర్ తీసుకువెళ్ళి ప్రపంచ ఖ్యాతి నార్జించి ఆంధ్ర కళామతల్లికి నివాళు లర్పించాలని ఆశిస్తున్నాను.

శ్రీనివాసచక్రవర్తి
నాట్యకళా సంపాదకులు, విజయవాడ.

మీరు పంపిన ఆహ్వానము అందుకొంటిని. శ్రీ నాజరుగారివంటి ఉత్తమ కళాకారుడు యింకా అనేకమంది శిష్యులను తయారుచేసి కళను దేశములో ప్రచారముచేసి కీర్తి సంపాదించగల శక్తి పరమేశ్వరుడు శ్రీ నాజరుగారికి ప్రసాదించుగాక యని కోరుచూ సన్మానసభ జయప్రదముగా జరుగగలదని నమ్ముచున్నాను.

కళాప్రపూర్ణ ద్వారం వెంకటస్వామినాయుడు
ట్రిప్లికేన్, మద్రాసు.5.

మిత్రులు శ్రీ నాజర్ మా కళాకుటుంబము లోనివాడు. అట్టి మా సోదరునకు మీరు జరుపుతున్న యీ ఘనసన్మానము కళాకారులందరికీ చెందుతుంది. మీరు కళాకారులయెడ, కళలపట్ల చూపుతున్న ఆదరప్రోత్సాహాలు, కళాభిమాను లందరికీ చిరస్మరణీయములై ఆదర్శవంతములు కాగలవని ఆకాంక్షిస్తున్నాను. సభ జయప్రదంగా జరగాలని ఆశిస్తున్నాను.

*మహావాది వెంకటప్పయ్యశాస్త్రి, గుంటూరు.*

లలితకళోపాసకు లెల్లరకు సంతోషకరమైన ఉత్సవమిది. త్రివిధాభినయములతో సర్వదృశ్యములను కన్నులకు కట్టగల దిట్ట శ్రీ నాజరు. ఈ కళకొరకే ఆయన పుట్టెనా యని యనిపించుచుండును. అట్టి కళామూర్తిని గౌరవించెడి మీ రందరును మాకు గౌరవ భాజనులైనారు. ఉత్సవము నిర్విఘ్నమగును గాక!

*పోణంగి శ్రీరామఅప్పారావు, ఎం. ఏ., పిహెచ్. డి.,*
**గవర్నమెంటు ఆర్టుకాలేజి, శ్రీకాకుళము.**

ఒకప్పుడు తెలుగు గుండెలను గుబగుబ లాడించటంలో గలగల లాడించడంలో మన జానపదకళ లనేకం అందెవేసిన చేతులుగా వర్ధిల్లినవి. వానిలో తలమానికంగా బుఱ్ఱకథ లేదా జంగంకథ విలసిల్లినది.

కాలంకొద్దీ మార్పులు అవసరమైతే అవి ఇతివృత్తంలో కావాలిగాని ఆ కథాపద్ధతులలో, ఆ ప్రక్రియలో గాదు. అది మనకెందుకోగాని అంతగా పట్టదు. అందుకనే ఒకటి వస్తే మరొకటి అంతరించిపోతూ తెలుగుదేశంలో ఎన్నెన్ని ప్రాచీనకళలో కళారూపాలో అంతరించిపోయినవి.

అలా పోలేక పోలేక పోతూ అరకొరప్రాణంతో ఉండిపోయిన ఈ బుఱ్ఱకథను సజీవకళారూపంగా తెలుగునాడున విస్తరింపజేసిన వారిలో శ్రీ నాజరు ఒకరు. ఆయన అందులో చేసిన కృషి అనుపమానము, అనన్యసామాన్యము.

అందువల్లనే అలాంటి కళాకారునికి కొందరు మిత్రులు సన్మానం జేస్తున్నారంటే సహజంగా ఎంతో ఆనందంగా ఉంది.

కళాసమారాధనం కళాకారుల సన్మానరూపంలో వెలువడవం చిత్రమేమి కాదు కదా! ఈ సన్మానోత్సవాలు జయప్రదంగా జరుగగలవని ఆశిస్తున్నాను.

**విద్వాన్ విశ్వం**
**సహాయ సంపాదకులు, ఆంధ్రజ్యోతి, విజయవాడ.**

తెలుఁగు రసజ్ఞ లోకానికి, జానపదుల బుఱ్ఱకథా విధానములో తాళ, రాగ, భావ, విన్యాస సమ్మిళితమైన నూతన ప్రక్రియల నందించి యావదాంధ్ర జనాళిని అలరింప జేసిన ప్రప్రథమ బుఱ్ఱకథా పితామహుఁడవు నీవే!

తెలుఁగు వైజ్ఞానికరంగంలో నాజరు అంటే నజరానగా కీర్తింపఁబడ్డ బుఱ్ఱకథా

పై తాళికుడవైన మిమ్ములను యీ సన్మానవేదికపై కుందనంపుటందెలు ఢాకాల నలంక రించి, సువర్ణకుసుమాలతో అభిషేకించిన వదాన్యులు ధన్యులు—మీరు ధన్యులు. తెలుగు కళాలక్ష్మి ధన్య.

నేదునూరి గంగాధరం
రాజమహేంద్రవరము

శ్రీ నాజరుకు "కనకాభిషేకం" చేస్తూ "గండపెండేరము" బహూకరిస్తున్నా రని విని చాలా సంతోషించాను. "బుర్రకథ" కళాకారులలో ముందడుగు వేసిన శ్రీ నాజరుకు ఉత్సవ మేర్పాటుచేసి, మీ రీ విధంగా గౌరవించడం అతి సమంజసము.

ఉత్సవము జయప్రదమగుగాక!

(సం.) కె. వి. గోపాలస్వామి
ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు.

కళాకారులను కనకాభిషేకం, గండపెండేరాలతో పూజించే ఉదారులగు భీమవరం వారికి నా ధన్యవాదాలు. ఈ సన్మానం మన రాష్ట్రానికి గర్వకారణం. సన్మానసభ జయప్రదమగుగాక. శ్రీ నాజరుగారు ఆయురారోగ్య భాగ్యములతో తులతూగాలని కోరుతున్నాను.

జి. రాఘవ, తెనాలి.

శ్రీ నాజరుగారి ప్రదర్శనలు నేను చూచినాను. ఆ కళ నిజముగా ఆయన సొత్తు. బుర్రకథతోపాటు తీరుతీరుల జానపద గేయములను వారు సమయోచితముగా ప్రయో గించి ప్రచారము చేయుచున్నారు. ప్రజోపయోగమునకై వారీ కళను బాగుగా వాడు చున్నారు. ఆంధ్రదేశము వారికీ విషయమున ఋణపడియున్నది. వారికి నా అభినందనలు.

బి. రామరాజు, ఎమ్. ఏ., పిహెచ్. డి.
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్.

బుర్రకథ కళలో నాజరుగారు నూతనత్వాన్ని సృష్టించారు. వారికి ఈ సన్మా నము జరుగుట చాల ముదావహము. వారికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యము లిచ్చి రక్షించుగాత.

వావిలాల గోపాలకృష్ణయ్య, ఎమ్. ఎల్. ఏ.
సత్తెనపల్లి

ఒకప్పుడు బుర్రకథలు మన దేశంలో మాసిపోయినవి. అనవసరములైనవి. నేడు బుర్రకథ కళాస్వరూపమునకు మన జీవితంలో వాటికొక నిర్ణీతస్థానం ఉంది. బుర్రకథను పునరుద్ధరించి, దాని కొక నూతన చైతన్యము నిప్పించి, మన జీవితమందొక అవసర భాగ

ముగా జేసి, నిజ కళాస్వరూపమును చేసిన నాజరుగారు, నిశ్చయముగా ఒక కళాకారుడు. బుర్రకథ వివరణయందు నాజరుగారి కొక ప్రత్యేక శైలి ఉంది. వీరరస మతని సొమ్ము.

నాజరు గారికి సన్మానము జరుగు చున్నందుకు నాకెంతో సంతోషము. అతనికి నా హృదయపూర్వకమైన అభినందనాలు.

ఆమంచర్ల గోపాలరావు

ఆలిండియా రేడియో, అసిస్టెంటు ప్రొడ్యూసరు, విజయవాడ.

బుర్రకథను ఒక కళగా భావించి దానిని అత్యుత్తమ స్థాయికి గొనివచ్చినది శ్రీ నాజరుగారు. వారి కథ వింటూంటే ప్రేక్షకులకు ఒళ్ళు పొంగి గగుర్పాటు జనిస్తుంది. చక్కని ఉచ్చారణ, రసపోషణ బుర్రకథలో వారు అందెవేసిన చేయి. వారికి గండపెండేర మివ్వడం చాలా ముదావహం. నా అభివందనాలు వారికి. మీ కృషి ప్రశంసనీయము.

బందా కనకలింగేశ్వరరావు

డ్రామా ప్రొడ్యూసరు, ఆకాశవాణి, విజయవాడ.

నాజరుగారు ఆంధ్రరాష్ట్రములోనే గాక యావత్ భారత దేశములోకూడ కీర్తిప్రతిష్ఠలు తెచ్చుకున్నారు. వారు ఈ సన్మానం పొందుటకు ఎంతయు అర్హులు నారాయణదాసుగార్ని హరికథా పితామహు లన్నట్లుగా నాజరుగార్ని బుర్రకథా పితామహు లని అనుట ఎంతయో సముచితముగ వున్నది. వారికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యము లిచ్చి రక్షించుగాక.

ప్రయాగ నరసింహశాస్త్రి

ఆలిండియా రేడియో, విజయవాడ.

పదిహేను సంవత్సరములుగా అనేక బుర్రకథలు రచించి చెప్పి ఆంధ్రప్రజల్లో అశేషమైన కీర్తి నార్జించుకొన్న నాజరుకు బుర్రకథా సామ్రాట్ అనే బిరుదాన్ని యిచ్చారని విన్నాను. యిప్పుడు రసజ్ఞులు, సహృదయులు నాజరుకు గండపెండేర మిచ్చి కనకాభిషేకం చేస్తున్నారని విని చాల ఆనందించాను. ఈ శుభసమయంలో శ్రీ నాజరుకు నా శుభాకాంక్షలు అందిస్తున్నాను.

కొడాలి గోపాలరావు

నాటక రచయిత, పెదరావూరు.

నేను కాలేజీలో చదువుతున్న రోజులు. ఒకనాడు పార్కులో శరత్ శ్రీకాంత చదువుకొంటున్నా. మా మిత్రులు కొంతమంది వచ్చి కథకు వెళుతున్నాం బెస్టు పర్ఫామెన్సు, ఛాన్సు లూజు చేసుకోవద్దు అంటూ వెళ్ళిపోతుంటే నేనుకూడ వెళ్ళా. తీరా అక్కడికి వెళ్ళేసరికి బుర్రకథ చెబుతున్నారు. ఇళ్ళ ముందుకొచ్చి జంగాలుచెప్పే కథేగా?

ఏమిటి జనం వేలాది ప్రజలు క్రిక్కిరిసియున్నారు అని అనుకోవటం జరిగింది. కొద్ది క్షణాల్లో పల్నాటియుద్ధం బుర్రకథ వింటుంటే నేను పొందిన అనుభూతికి విలువ చెప్పలేను. కథకుడు ఎవరంటె నాజరు అన్నారు. ఆనాటినుండి ఈనాటివరకు బుర్రకథ మాటవస్తే నాటి నాజరు ఈనాటికి మరుపురాడు. వారికి సన్మానం అంటే నా సంతోషానికి అంతులేదు.

**ఆలపాటి సత్యనారాయణ,** సిరిపురం.

నాజరు నేను సమకాలికులం. వైజ్ఞానికోద్యమంలో జానపద కళారూపాల పునరుద్ధరణకై కలిసి పనిచేసిన కళాకారులం. సన్మానోత్సవ నిర్వాహకులకు, నాజరుగారికి నా కళాభివందనములు.

*మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి,* మద్రాసు.

స్వయంకృషితో తెచ్చుకున్న ప్రతిభ నాజరుగారిది. ప్రప్రథమంగా ఆంధ్ర దేశంలో నాజరుగారి ప్రతిభను గుర్తించిన గౌరవం భీమవరం పౌరులకే దక్కింది. అందుకు మా ధన్యవాదాలు.

**వై. వి. రాజు, అనసూయ,** మద్రాసు.

కళాలక్ష్మి సేవచేసే భాగ్యం నాజరుగారిద్వారా మాకు లభ్యమయింది. ఆచార్యుడుగా కళాభ్యాసం చేయించిన మహనీయులు పూజ్యులు అయిన శ్రీ నాజరుగారికి గండపెండేర మిచ్చి కనకాభిషేకం చేయటం జానపద కళాలక్ష్మికి హర్షనీయం. ఆంధ్ర కళాకారులకు ప్రసంశనీయమైన పర్వదినం.

***ధనేకుల వీరయ్య, వెలువోలు తిరుపతయ్య, కడియం బ్రహ్మానందం, నూరుబాష్ ఖాసిం.***
**సిరిపురం.**



"వెన్నెల తరి – జానపదుల ఝరి
జనపదాల ప్రాణం – పదపదార్థ
తరతరాల యానం – మధురస్వప్నాల తానం
పుణ్యజనుల గానం – పూర్వ యక్షగానం"

— 'పురాణం'

# కళామూర్తికి సన్మానం!



ఆకుల సుబ్రహ్మణ్యం

శ్రీ నాజరుగారికి కనకాభిషేకం; నాజరుగారికి గండపెండేరము. ఎవరీ నాజరు. ఏమిటా కనకాభిషేకం? ఎందుకా గండపెండేరము? నాజరుగారికి యీ సన్మానం జరుగుతుందని విన్నప్పుడు ఒక రచయితగా నేననుభవించిన ఆనందము నాకు తెలిసిన కొద్దిభాషతో వర్ణించటం వీలుకాకుండా వుంది! ఓహో! ఎంత సంతోషము!

నాజరంటే 'బుర్రకథా' కళామూర్తికి బొట్టుపెట్టి, కాళ్ళకు గజ్జెకట్టి ఆడించిన అఖిలాంధ్రులనూ ఆనందాబ్ధిలో ఓలలాడించిన కళామూర్తి.

బుర్రకథలు తెలుగు దేశానికి క్రొత్తవికావు. కానీ 'బుర్రకథా' కళాశాఖ ఎండి విరిగిపోతున్న సమయంలో యీ కళామూర్తి తిరిగి ప్రాణంబోసి పంచరంగుల రామచిలుకలా ఆడిపించేడు!

నాజర్ 'బుర్రకథ' కళావిన్యాసానికి ఎండిన గడ్డిపోచలుకూడా ప్రాణం బోసికొన్నవి. వారి మృదుమధుర స్వరానికి వీణ వంతపాట బాడినది. వారి దుఃఖపూరిత గాన వాహినిలో ఎన్నో బండరాళ్ళు కరగిపోయినవి.

'నాజర్' బుర్రకథా పితామహులనటంలో ఎంతైనా వొప్పియున్నది! నాజర్ మధురనామం తెలుగువారి తీయటి నాల్కులపై ప్రతినిత్యం కొంగ్రొత్త రుచులను వెదజల్లు చూనే వుంటుంది!

అందుకే యీనాడు వారికి శ్రీ జవ్వాది, నాజర్కు జవ్వాజి స్నానముచేయించి, కనకాభిషేకం చేయిస్తున్నాడు.

జవ్వాది మహాకవి! ఆతడు శ్రీకృష్ణదేవరాయలు. అందుకే జవ్వాది యీనాడు ఒక కళామూర్తికి తానే స్వయంగా కనకాభిషేకం చేస్తున్నాడు. జవ్వాదిలాంటి మహాకవి చక్రవర్తిచేత కనకాభిషేకం చేయించుకొన్న నాజరు అదృష్టవంతుడు.

కనకాభిషేకాలు, గండపెండేరాలు మన ప్రాచీన సాంప్రదాయాలు. ప్రాచీన సాంప్రదాయమైన బుర్రకథకు జీవంబోసిన నాజర్కు ప్రాచీన భారత సాంప్రదాయంలా యీ మహాసన్మానం జరుపుచున్న శ్రీ జవ్వాది, మహాకవి చక్రవర్తి యీనాడు తెనుగు వారికి మరంత ఆప్యాయుడైనాడు.

కళలంటే నిరాదరణ చూపబడుచున్న యీ రోజుల్లో కవిత్వమంటే హ్రస్వదృష్టి ప్రసరింపబడుచున్న యీ విడ్డూరపు కాలంలో, ఒక కళామూర్తికి మహాసన్మానం జరుపబడుచున్నపుడు, అదీ ఒక మహాకవి చక్రవర్తి తనే స్వయంగా జరుపుచున్నపుడు, కళాకారులకు ఎంత సంతోషము! ఎంతానందము! ఎంత పెద్దపండుగ!

నాజర్గారూ! ఈ శుభసమయంలో తమకు నా అభినందనలు! తమకు భగవంతుడు ప్రసాదించిన అమూల్యమైన కళాశక్తితో జాతికీ, దేశానికీ, పతిత జనావళికీ మరింత సేవచేయుమని యీ పవిత్ర సమయంలో మిమ్ములను కోరుచూ, మీకు భగవంతుడు పూర్ణాయువు ప్రసాదించుగాక యని ప్రార్ధించు చున్నాను!

# కళ ... — కారుమంచి వెంకటేశ్వరరావు

ప్రేక్షక (పాఠక) లోకాన్ని ఆలోచింపచేసి తాము చూపిన మార్గాన్ని అనుసరించి భావించి నిర్మించుకొన్న ఆదర్శాలకోసం, కార్యోన్ముఖులను చేసేదే కళ – నేడు కళాకారుడనే పేరుతో పిలువబడువాడు తానుగూడా కళాకారుడనని అనుకొని ఆవేశ, ఉద్వేగాలు మొదలైన భావాలకు లోనై, కళాస్వాదకుల యెదుట కళను సృష్టించలేక పోతున్నాడు. తాను కళా నిర్మాతనను అభిప్రాయంతో శాస్త్రసమ్మతంగా (సైన్సు) ఏది ఏ పాళ్ళలో మిశ్రమముచేసి ప్రేక్షకుని ముందుంచితే, కళాస్రష్టయొక్క అనుభూతిని అదే స్థాయిలో ప్రేక్షకుడు పొందునట్లు చేయునో అదే కళానిర్మాణముయొక్క పరిపూర్ణమైన రూపము –

"కత్తి కిరువైపులా పదునుంటుంది
నిప్పంటుకుంటె పొక్కుతుంది"

అందుకే కళారూపాలుకూడా సమాజ పురోగమనానికి మానవతా నిర్మాణానికి నిరంతరం కృషి సల్పుటకై వివిధ కళారూపములు ముందు వెనుకలుగా సృష్టింపబడ్డాయి. అధికారాన్ని హస్తగతం చేసుకొన్నవారు తమ పతనానికి కాలం సమీపించుకొద్ది తమకున్న వసతుల ప్రకారం ఆ కళారూపాలనే ఆధారంగా మానవతా పురోగమనానికి అడ్డుగోడలు కట్టడంకోసమై కళారూపాలకు బంగారుతొడుగులను తగిలించి శవాల గుట్టలుగా తయారుచేసారు. అందుచేతనే పురోగమనరూపం నిరోధకరూపంగా వ్యాప్తిచెందుటచే అనేకమైన కళారూపములు సమాధులలో మరుగునపడి యుండటం జరిగింది. ఋషులైన కళాస్రష్టలు కొత్తరూపములను వెలువరించవలసి వచ్చింది.

కళాస్రష్ట ఋషిగా నిలచినపుడే నిజమైన కళ సృష్టించబడుతుంది. నేటి సమాజంలో సర్వకాల సర్వావస్థలయందు స్రష్టగా నిలచి జీవించటం అసంభవం. అందుచేత కళాస్రష్ట కళను జీవనోపాధికే ఉపయోగించకుండా కళా నిర్మాణానికై కృషి చేయవలసి యున్నది. అందువల్ల ప్రతి కళాస్రష్ట జీవనమునకు వేరుమార్గము అవలంబించకున్న పురోగమన నిరోధకులకు అమ్ముడుబోవల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. కనుక కళ అమ్ముటకు గాక విశ్వ శ్రేయస్సు కొరకే నిర్మించినపుడు పాత రూపములను పెకలించి క్రొత్త రూపములను నిర్మించుట సంభవము.

# తంధాన కథకు రూపకల్పన

శతాబ్దాలనుండి మానవులు తమ అవస్థా భేదాలకు అనుగుణంగా ఆడిన పాడిన ఆదికళారూపాలకు మూలమైన యక్షగానము సంగీతాన్నీ సాహిత్య స్వరూపాన్ని ఒకటేమిటి తన నిజ స్వరూపాన్నే కోలుపోయి ఏ మతాన్నో రాజరికాన్నో రాజునో ఇతివృత్తంగా తీసుకుని ఒకే రగడలో ఇంటింటి ముందూ వినుపించే స్థితిలో ఉన్నది.

ఈ దశలో శ్రీ రెంటపాళ్ళ గుడ్డిజంగంగారు కొంత పరిశోధించి కందార్థాలూ దరువులూ పదాలూ జోడించి సముద్ర మదనంలాంటి కథలు చెప్పటంతో రూపురేఖలు ఏర్పడసాగెను. తదుపరి శ్రీ దొడ్డవరపు వెంకటస్వామిగారు గద్య పద్యములే గాక ఆధ్యాత్మ రామాయణ కీర్తనల బాణీలు అనుకరించి వాటికనుగుణంగా ధేనువకొండ వెంకయ్యగారిచే భారత కథలు వ్రాయించి ప్రదర్శించటంతో అక్కడక్కడ కర్నాట సంగీతం వినుపించినా, కథయొక్క రూపురేఖలు మరింత విస్పష్టమైనవి. ఇదే పద్ధతిలో ప్రారంభించి దేశీయ కళల స్వరూపాలను తెల్పే లక్ష్మణదీపిక వంటి ప్రాచీన గ్రంథాల నాధారం చేసుకుని జోలపదాలను, ఊయల పదాలనూ, ఊడ్పుల పదాలనూ, నూర్పిళ్ళ పదాలనూ చందమామ పదాలనూ, దరువులనూ, ద్విపదలనూ మంజరులను జోడించి అప్పకవి చెప్పిన రగడల అర్థ చంద్రికల గుదిగూర్చి "పల్నాటి యుద్ధం" "నేటి రాయలసీమ" "బొబ్బిలియుద్ధం" బుర్రకథలు వ్రాసి ప్రదర్శిస్తూ తంధాన కథకు అనగా బుర్రకథ లేక యక్షగానమునకు ఇదే ఆదిరూపమని ప్రజల ముందుంచాను.

"మార్గదేశి విభాగేన
సంగీతం ద్వివిధం మతం"

ప్రజలు అవస్థాభేదములకు అనుగుణంగా పశుపక్ష్య పరిసరములను అనుకరించి స్వానుభవమును జోడించి మలుచుకున్న పణుకులు. లేక రాగాలే - దేశి సంగీతం. అట్టి దేశీయ ఫణుకులను నేర్పే పాఠశాలలు లేనందున దేశి కళారాధకులకు ప్రజలే గురువులు. అనగా! అనాగరిక తెగలనుండీ అందె కోటాదాసు నాసరదాసు, జంగా సుబ్బాదాసు, యాదవదాసు వంటి ఉత్తమ వీధిభాగవతులనుండి, ఉత్తర, దక్షిణభారత మార్గసంగీత విద్యావేత్తల బాణీలయందున్న యమకముల గమకములను ఏర్చి కూర్చుకొనుచున్నాను. దేశీయ గానము సహజమైనదనీ జాతి జీవితంతో పెనవేసుకొని వృద్ధిచెందినది. అందుకే అది మధుర సంగీతమైనది. మార్గసంగీతం అట్టి దేశీయ సంగీత లక్షణాలను అనుసరించేందుకు అనువుగా - స్వరపరచినదే గనుక మార్గ సంగీతంలోని మంచి నెంచుకున్నాను.

మానవులు అభివృద్ధిచెందారు. అవస్తలు పెరిగాయి; అవసరాలు ఆదర్శాలూ అనుభూతులూ పెరిగాయీ మారాయికూడాను, సంగీతంకూడా దాని స్వరూపాన్ని కోలుపోని రీతిలో మధురమైన మార్గాన వృద్ధి చెందాలి. నాకు తెలిసిన రీతిలో యక్షగాన ప్రాచీన సాంప్రదాయాన్ని పునరుద్ధరించి సృతికి, గతికి తంబుర పై దరువులు వేస్తూ అందెల తాళముతో మువ్వల నాట్యముతో రెండు గుమ్మెటుల దరువులతో ఆడి పాడి అభినయించే గానమే లేక నాట్యమే నేడు నా యక్షగానం లేక బుర్రకథ. పిన్నలు పెద్దలు లోపాలను సవరించి ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

- నాజర్

# నాజరు

## జీవిత రేఖలు

శ్రీ పురాణం వెంకటసుబ్బారావు

మరుగుపడిన జాతులనుండి
మరవురాని బాధలనుండి
బ్రతుకు గతుకు బాటలనుండి
తెలుగునాట వికసించాడు

పువ్వు పుట్టగనే పరిమళించినట్టు విద్యుత్ కాంతి వలె తనకు తానై లోకంచే గుర్తింపబడిన పూవు శ్రీయుత నాజర్. ఈయన 1920 సంవత్సరములో గుంటూరుజిల్లా పొన్నెకల్లు గ్రామంలో షేక్ మస్తాన్ సాహెబు బీబాబి దంపతులకు ప్రథమ పుత్రుడుగా జన్మించాడు. నాజర్ అని ముద్దుగా పేరు పెట్టుకొన్నారు. పేదరికమె ఆస్తిగా, మూఢత్వమె మోక్ష సాధనంగా పుట్టుకవల్లనే చదువు సంధ్యలు నిరాకరించబడ్డ పేద ముస్లిం కుటుంబములో పుట్టి పెరిగాడు. తాతల కాలంనుండి సొన్నాయి విద్యద్వారా సంగీతం వారింట తిష్ఠ వేసుకొని తిండిలోపం తీర్చలేకపోయినా తీరుతెన్నులు కలిగి వికసించింది. నాజర్ తండ్రి కొడుకుని సంగీతంలో ప్రవీణుణ్ణి చేయాలని తనకంటె విద్వాంసుడై కీర్తిప్రతిష్ఠలు సంపాదించగల సమర్థుడై తెలుగునాట గణించాలని కలలు కంటుండేవాడు. కొడుకును ఎలిమెంటరీ స్కూలులో ప్రవేశపెట్టి చదివిస్తున్నాడు. విత్తొకటి వేస్తే చెట్టొకటి కాదుగదా!

ఎనిమిది సంవత్సరాలు నిండకపూర్వమె రంగుపూసి, తెనాలి బాలరత్న సభవారు నాటకాల్లో వేషాలు వేయించారు. అయిదు సంవత్సరాలపాటు స్త్రీ పాత్రలు ధరింపచేసారు. ధరించిన పాత్రలకు ఆనాడే బంగరు పతకములు బహుమతులుగా లభించాయి. పుట్టుకతోనే సంగీతం నాజరు సొమ్మవటంతో తొమ్మిది సంవత్సరాలు నాటక సమాజాల్లో పనిచేసి ప్రజల ప్రశంసలు పొందటం తండ్రి గ్రహించి సంగీత శిక్షణకుగాను 1937 సం॥లో నరసరావుపేట వాస్తవ్యులయిన మురుగుళ్ల సీతారామయ్య గారివద్ద ప్రవేశపెట్టాడు. ఆర్థికంగా పరిస్థితులు సుకరంగా లేకపోయినా తండ్రి సాహసించి నెలకు మూడు రూపాయలు చొప్పున పంపుతూ సంగీతశిక్షణకు నాజరుకు తోడ్పడ్డాడు.



విధి బలవత్తరమయినది. పరిస్థితులు అనుకూలించలా? సంగీతశిక్షణ రెండవ సంవత్సరం నిండకపూర్వమే తండ్రిగారు మరణించారు. నాజర్ వయస్సు ఆనాటికి పందొమ్మిది సంవత్సరాలు. కుటుంబ భారం నాజరు భుజస్కంధాలపై పడింది. వ్యవసాయ వృత్తిని స్వీకరించాడు. చేసే చాకిరి చేస్తున్నా ఫలితం మాత్రం ఏమంత అనుకూలంగా లేదు. అప్పులు అవస్తలు ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. వ్యవసాయం ఎత్తిపారేసి పుగాకు కంపెనీలో ముఠాకూలీగా ప్రవేశించాడు.

రెక్కలు ముక్కలు చేసుకొన్నా నెలాఖరుకు కూలి స్తుంటె తను చేసినదానికి కంపెనీ మేనేజుమెంటు యిచ్చేదానికి వ్యత్యాసం రావటం గమనించి మేనేజుమెంటు మీద తిరుగుబాటు చేస్తే పనిలోంచి తొలగించారు నాజర్ను. కండలు కరిగించి బండచాకిరిచేసే పాటకూలీలు కిక్కురుమనకుండా వూరుకున్నారు.

మిషను కొనుక్కొని కుట్టుపని ప్రారంభించి దానికి తోడుగా బాల బాలికలకు సంగీతశిక్షణ యిస్తూ పొట్ట గడుపుకుంటూ 1942 సం|| వివాహం చేసుకొని పౌరాణిక నాటకాల్లో అర్జునుడు ధర్మరాజు మొదలగు పాత్రలు ధరిస్తూ నాటక సమాజాలకు నాటకాలు నేర్పుతున్న సమయంలో స్వాతంత్ర్య సమరజ్వాలలు నలుదిసలా క్రమ్ముకొన్నవి. అతివాద మితవాద శక్తుల ప్రభావం ప్రజలపై ప్రసరించింది. జాతీయోద్యమాన్ని నడుపుతున్న పెద్దలంతా జైళ్ళలో వున్నారు. అభ్యుదయ విప్లవకర భావాలు అతివాదుల ద్వారా ప్రజల్లోకి చొచ్చుకొస్తున్నాయి. ఈ ప్రభావం నాజరుపై బడింది.



విదేశీయుల పాలనలో దేశం ఏ స్థితిలో వుందో ఇట్టి సమయంలో తన కర్తవ్య మేమిటో తెలుసుకొన్నాడు. నికృష్ట జీవితంతో కుంగి కృశించుతోన్న ప్రజల సమస్యల పరిష్కారమార్గం చూపే మార్క్సిష్టు గ్రంధాలు అధ్యయనం చేయటం ప్రారంభించి కర్తవ్య సాధనకు నడుం కట్టాడు. వాస్తవికితకు అనుగుణంగా మానవ పురోభివృద్ధికి బాటలు చూపే యితివృత్తాలను తీసుకొని తంబురి బుజాన వేసుకొని ప్రజల కళారూపమైన బుర్రకథలు చెప్పటం ప్రారంభించాడు. శ్రీ కాకుమాను సుబ్బారావు, సుంకర సత్యనారాయణ, ప్రయాగ కోదండరామశాస్త్రి మొదలగు ప్రజాకవుల ఆదరాభిమానాలు లభించాయి. కృషితో నాస్తి దుర్భిక్షం జపతో నాస్తి పాతకం" అన్నట్టు సాహిత్య పరచయం పెరిగింది. పరిస్థితుల ప్రభావం నాజర్ను బుర్రకథారచయితగా రూపొందించినవి. తొలిసారిగా "బెంగాలు కరువు" అనే బుర్రకథను వ్రాసి మిత్రులైన రామకోటి పురుషోత్తం గార్ల సహకారంతో ఆంధ్రదేశం నలుమూలల గానంచేసి లక్షలాది ప్రజానీకాన్ని ఉర్రూతలూగించి ఆంధ్రేతర ప్రాంతాల ప్రముఖులగు అబ్బాస్, బలరాజ్ సహానీల ప్రశంసలనేకాక నాట్యకళాప్రపూర్ణ బళ్ళారి రాఘవ, డా|| గోవిందరాజుల సుబ్బారావు, గూడవల్లి రామబ్రహ్మం గార్ల ఆశీస్సులు పొందటం జరిగింది.

1947 ఆగష్టు 15 న స్వాతంత్ర్యం లభించింది. స్వాతంత్ర్య సముపార్జనలో నడుంగట్టి పోరాటంలో అగ్రగాముల్లో నిలిచిన నిరుపేదలను మేలుకొల్పుతూ గేయరచనలు ప్రారంభించి ఆసాములు అన్నదాతలైన రీతులను-

కురిసెరాతోల
కరి ఓరన్నా
కోటేరు వేయ
రా రైతన్నా
పంటపై రేయ
రా ఓరన్నా
ప్రజల బ్రతికిం
చరారైతన్నా

అంటూ కర్తవ్యాన్ని ప్రబోధించాడు. ఆస్తి, అధికారాలు, పొలం, బలం కలిసి భూస్వాములు సౌఖ్యాలకు బలై పోతున్న పాలేర్ల నికృష్ట జీవితాన్ని చూచి-

ఏరన్న రాకముస్నే ఏగ్వాక వచ్చేరన్నా
ఎవరింట నుందువన్న-ఓరన్నా జీతగాడ
కమ్మని కందిపప్పు-కనరాదు నేతిబొట్టు
వుప్పాకెనీము కాన-గొప్పోరి జీతగాడ
ఈభూమి మనదెనన్నా కాజేసెదొరలు మొన్ను
నీబలము చూపుమన్నా ఈపొలము పంచు
మన్న

భూమిని అమ్ముకొనటం పేరుతో భూస్వాములు ఆసాములుగాను, ఆసాములు అలగాజనంగాను మారే అధికవ్యవస్థను తొలగించాలని—

ఇందుగల నిక్షేమ మెవరిది
అందరూ వెతకాలి శ్రమపడి

అంటూ నూతన వ్యవస్థకై కృషి చేయాలని ప్రబోధించాడు. ఆంధ్ర దేశంలో ఆబాలగోపాలం సాధించిన స్వరాజ్యం సురాజ్యం చేయాలని సాగించిన రాజకీయ పోరాటంలో పాల్గొని ప్రభుత్వ నిర్బంధ విధానానికి గురై 6 మాసాలు జైలు జీవితం గడిపాడు. అంతేగాదు. స్టేజీనటుడుగా సుంకర వాసిరెడ్డి రచించిన "మా భూమి" అనిశెట్టి రచించిన "వెలుగు నీడలు" కొప్పరపు రచించిన "అల్లీముఠా" మొదలగు నాటకాల్లో ప్రధానపాత్రలు ధరించి ప్రజలు నిర్మించుకునే వుద్యమాల్లో ఒక భాగంగా పెరిగాడు.



1950 సం॥లో పుట్టిల్లు సినిమా నిర్మాతలు డైరక్టరు డాక్టరు జి. రాజారావుగారు సినిమాలో బుర్రకథ గానం చేయించారు. ఆలిండియా రేడియో నిర్వాహకులు నాజరుచే రచించబడిన భక్తప్రహ్లాద వీధి భాగవతం నాజరు దళంవారిచే రేడియోలో గానం చేయించారు. ఈ సమయంలోనే రాయలసీమ బుర్రకథ రచించి క్షామ నివారణకుగాను సహకరించారు. ప్రజల ప్రియతమ బుర్రకథ కళాకారుడుగా ప్రసిద్ధిచెందిన నాజరును 1953 సం॥లో తొలిసారిగా విజయవాడ కాలేజీలో కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి అధ్యక్షతను విద్యార్థిలోకం సన్మానించుకొంది.

1954 సం॥లో ఆంధ్ర నాటక కళాపరిషత్ సభలు గుడివాడలో జరుపుటకు సన్నాహాలు చేస్తుంటే ప్రజానాట్యమండలి సభ్యుల ప్రోత్సాహంతో "ఆసామి" నాటకం రచించి శ్రీ మాచినేని వెంకటేశ్వరరావుగారి దర్శకత్వంలో పరిషత్ పోటీ నాటకాల్లో నాటకం ప్రదర్శింపచేయుటలో నటుడుగా పాల్గొని ఉత్తమ నాటకంగా ప్రథమ బహుమతి పొందటం జరిగింది. ప్రజా నాట్యమండలి ద్వారా ఈ నాటకాన్ని ఆంధ్రదేశంలో 20 ప్రదర్శనాలు వరకు జయప్రదంగా ప్రదర్శింప చేసి నాటక రచయితగా ప్రజానీకానికి సుపరిచితు డయ్యాడు. ఈ తరుణంలోనే అగ్గిరాముడు సినిమాలో పక్షిరాజా ఫిలింవారు సీతారామరాజు బుర్రకథ గానం చేయించారు.

యావద్భారత ఖండం, ఆంధ్రప్రజల ఆదరాభిమానాలు ప్రముఖ పండిత పెద్దల సహకారాలు, సుప్రసిద్ధ కళాకారుల సహచర్యం నాజరును దినదిన ప్రవర్ధమానంగా పెంచి పోషించింది. ప్రాచీన యక్షగాన ప్రతిబింబమైన బుర్రకథ కళారూపాన్ని తీర్చిదిద్ది చరిత్రాత్మకమైన వీరోచిత గాథలు బుర్రకథలుగా వ్రాసి చెప్పటం నాజరు దినచర్యగా మారింది. తత్ఫలితంగానే పల్నాటియుద్ధం, బొబ్బిలియుద్ధం, వీరాభిమన్యు అల్లూరి సీతారామరాజు మొదలగు బుర్రకథలు సుప్రసిద్ధములయినవి. 1960 సం॥లో నాజరుగారిచే రచించబడిన గాంధీ జీవితం బుర్రకథ ఆలిండియా రేడియో హైదరాబాదు వారి రేడియో నాటకోత్సవాల రంగస్థల ప్రదర్శనంగా ప్రముఖుల ప్రశంసల నందుకొంది.

నాజర్ బుర్రకథ గాయకుడుగా రాణించడానికి

తోడ్పడిన సహచరులు: పురుషోత్తం, రామకోటి, లక్ష్మీనరసయ్య, మాచినేని వెంకటేశ్వరరావు, నందిగం వెంకటేశ్వరరావు, చిన్నబ్బాయి, సలాది భాస్కరరావుగార్లు.

నాజర్ బుర్రకథ దళం అనగానే రామకోటి, పురుషోత్తం స్మృతిపథంలోకి వస్తారు. పురుషోత్తమునకు మతి చెలించి పోవడంతో రామకోటి సినీరంగంలోకి ప్రవేశించడంతో శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య, మాచినేని వెంకటేశ్వరరావు గారలు దళం సజీవంగా రాణించడానికి తోడ్పడిన మిత్రులు. అదేవిధంగా నందిగం చిన్నబ్బాయిలు దళంలో పనిజేశారు. ప్రస్తుతం నాజర్ దళంలో హాస్యం వంతగా సలాది భాస్కరరావు చేస్తున్న కృషి ఆంధ్ర ప్రజల ప్రశంసలనందుకొంది.

1958 సం॥లో కాకినాడలో శాయీ భజన నాట్యమండలివారు సన్మానించి బుర్రకథా పితామహ అను బిరుదు ప్రదానం చేసి కలికితురాయి బహూకరించారు. విఘ్నేశ్వర ఆలయ భక్తమండలి కాకినాడవారు సింహతలాటం ప్రఖ్యాత కోడిగామూర్తి గారి ప్రియశిష్యుడు కోళ్ళ సీతారామస్వామినాయుడు గారి అధ్యక్షతన సమర్పించారు. తెలంగాణ థియేటరు సెంటరు కార్యదర్శి గ్రామాభ్యుదయ నాట్యమండలి నిర్మాతలయిన పురాణం వెంకటసుబ్బారావుగారు పెరుమాళ్ళ మనోహరస్వామిగారి అధ్యక్షతను ఖమ్మంజిల్లా మోటమర్రి గ్రామంలో సన్మానించి బుర్రకథా సామ్రాట్టు అను బిరుదు ప్రదానం గావించారు. 1959 సం॥ గుంటూరు తాలూకా లాం ఫారంలో ప్రభుత్వం జరిపించిన రైతు ఉత్సవాల్లో సన్మానించి గంటాకంకణం బహూకరించారు. బొబ్బిలిలో సింహతలాటం వరంగల్‌లో కాళోజి నారాయణరావు గారి అధ్యక్షతను సన్మానించి సువర్ణపతకమున్ను, దుగ్గిరాలలో నవరత్న హారమున్ను గుంటూరులో జరిగిన మెడికల్ ప్రాక్టీషనర్ల మహాసభలో ముత్యాలహారమున్ను, పాలకొల్లులో నటరాజ విగ్రహమున్ను, మద్రాసు సినీదర్శకుడు తాతినేని ప్రకాశరావు గారు రజిత పాత్రలున్ను మొదలగు బహుమతు లిచ్చిరి. ఆంధ్ర ప్రజల ప్రియతమ కళాకారుడుగా ఆదరించి, పోషించి, సహకారం లభింపచేసి కళాలక్ష్మి ఆశీస్సులు పొందే భాగ్యం ఆంధ్రావనికే దక్కింది.



ఆసామి నాటకంలో "అమరయ్యం"గా శ్రీ నాజరు

# శుభాకాంక్షలు


## కన్నెకంటి వీరభద్రాచార్యులు

( పల్నాటి సోదరకవులు )


తీయనిపాట ముందు వెనుదీయని కమ్మనిమాట శాస్త్రముం
బాయనియాట హావమును భావముఁ జూపెడి తెల్వి తేట సు
స్థాయిగనిల్చె నీయెడ నిజమ్ముగ నాజరుభాయి! నీకు దీ
ర్ఘాయువు కల్గుగాక విజయధ్వజ మెత్తుము తెల్గుగడ్డపై

హాయిగఁదోఁగు మందమలయానిల మానుచు గున్నమావిపై
కోయిలకన్నియల్ వలపుగుల్కుచుఁ బాడెడి భావగీతిలో
తీయదనమ్ము నీదు మహతిం జవిచూచిరి భారతప్రజల్
వేయి వచింప నేటికి పవిత్రకళానిధివీవు తమ్ముఁడా!

గాన కళాప్రవీణుఁడవు కావున బంగరు పూలవానలో
స్నానముఁ జేయుచుంటివి లసన్మహతీకథకాగ్రణీ! జయ
ధ్వానములొప్ప గగ్గెరను దాల్చుచునుంటివి గద్య పద్య స
మ్మానము లందుచుంటివి సుమమ్ములు చల్లఁగ సర్వమానవుల్

నాజరు! నీ కథల్ విన మనంబులు పొంగఁగ గుంపులై ప్రజల్
హాజరు గాఁదలంచెద రయారె ధరించితివా! మహాకళా
తేజము దేశమాత నిను తీరిచి దిద్దునుగాక నిత్య మ
వ్యాజ కృపా కటాక్షముల నాశిషమిచ్చుచు నాత్మ మెచ్చుచున్.

కవులు విపశ్చిదగ్రణులు గాయకసింహులుఁ గల్గు నీ సభా
భవనము నందు గౌరవ మపారముగా లభియించె నీకు నో
యువజనవీర! సర్వవిజయోన్నతులం దులతూగి లోక మం
దవిరళ కీర్తిఁ గాంచెదవు హర్షపయోనిధి నోలలాడుచున్.

# ఆంధ్రావనికి అందాలుదిద్దిన

# ఆదికళా స్వరూపాలు

శ్రీ 'ఎల్లోరా'

"నానా భావోప సంపన్నం
నాట్యమే తన్మయాకృతం"

జానపద కళలలో ఒకటా, రెండా అనేక రకాలు ఉన్నవి. అన్నీ వాటి వాటి సాధనాన్ని బలం చేసుకుని ఆయా శాఖలకు ఒక విలువను చేకూర్చుకొంటూ విజ్ఞాన వినోదాలను పంచిపెడుతూనే ఉన్నాయి.

వినోదప్రదమైన తోలుబొమ్మలు, వీధిభాగోతం, వీధినాటకాలు, యక్షగానాలు, పగటివేషాలు-ఇవన్నీ జానపద కళారూపాల క్రిందకే వస్తాయి. ఈ దేశి సారస్వత నందనవనంలో వికసించిన మరో మందారమే సంగీత రూపకంగా చెప్పకొనే బుర్రకథ.

తోలుబొమ్మలు, యక్షగానాలు, పగటివేషాలతో పాటు బుర్రకథా సంప్రదాయం కూడా చాలా ప్రాచీనమైనదే.

పూర్వకాలంలో కూడా జాతినీ, సంఘాన్నీ నానా రకాలుగానూ, పెద్దరికం పేరుతోనో, మరో విధంగానో దోచుకుతినడం పరిపాటి. ఈ విషయం మన ప్రాచీన చరిత్ర పాఠాలు చెప్పిన జగమెరిగిన సత్యం! అలా దోపిడీలక్రింద అధికార కబంధ కరాళ హస్తాల క్రింద నలిగి బాధపడుతూన్న అమాయక ప్రజల కష్టాలను బట్టబయలు చేయడం అవసరం. అలాటి పరిస్థితులలో వాటిని ప్రచారం చేయడానికి పగటివేషాల మాదిరిగానే బుర్రకథలు ఎంతగానో తోడుపడిన వనడంలో సందేహం లేదు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దంలో ఆంధ్రదేశాన్ని పరిపాలించినవారు శాతవాహనులు. వీరి కాలంలో సంగీత నాట్య, వినోదకళలు ప్రచారంలో ఉన్నట్లు - హాలుడు రచించిన "గాథాసప్తశతి" మనకు సాక్ష్యంగా నిలిచి చెబుతూన్నదే! నాటినుంచి నేటివరకూ ప్రజాదరణ, రాజాదరణ అందుకొంటూ సజీవ కళలుగా నిలిచినవి నాలుగు కనుపిస్తున్నాయి. ఒకటి: యక్షగానాలు, రెండు: తోలుబొమ్మలు, మూడు: బుర్రకథలు, నాలుగు: నృత్య ప్రదర్శనలు. ఈ కళలు పన్నెండవ శతాబ్దంలో చాలా ప్రచారంలో ఉన్నట్లు 12వ శతాబ్దివాడైన పాల్కురికి సోమనాథకవి "పండితారాధ్య చరిత్ర"లో ఇలా వివరించాడు:

"భ్రమరులు జాళెముల్ బయనముల్ మెరసి
రమణ బంచాంగ పేరణి యాడువారు
ప్రమథ పురాతన పటు చరిత్రములు
క్రమమొంద బహునాటకము లాడువారు
లలితాంగరస కళాలంకార రేఖ
లలవడ బహురూప మాడెడువారు
అమరాంగనలు దివినాడెడు మాడ్కి
సమరంగ గడలపై నాడెడువారు
భాగవతాది కథలు చీరలమరగు
నారంగ బొమ్మల నాడించువారు
కడు నద్భుతంబుగ గంథ సూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు
వారట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాత్రల నాడించువారు"

ఈ ప్రాచీన కళాఖండాలు - కూచిపూడి నృత్య భారతికి నిలయమైతే, పల్లెలాటి ప్రదేశం తోలుబొమ్మలకు నిలయమైంది. యక్షగానకళకు తంజావూరు నిలయమైతే కురవంజికి నాడు దక్షిణ భారతంలోని ప్రసిద్ధ యాత్రా కేంద్రాలయిన శ్రీశైలం, తిరుపతి నిలయాలైనవి.

తోలుబొమ్మలు :- కూచిపూడి భరత విద్యకు మూల పురుషులు బ్రాహ్మణులైనట్లే తోలుబొమ్మ లాటలకు

ప్రధానులు మహారాష్ట్రులు ! ఈ తోలుబొమ్మలాటలు మొట్టమొదట తెలుగునాటనే ప్రారంభమని, రాను రాను కారణాంతరాల వలన మలబారు ప్రాంతాలకు వలస వెళ్ళాయని ఒక ప్రచారం. మరోవిధంగా-అసలు ఈ తోలుబొమ్మల పుట్టుక మహారాష్ట్ర దేశంలో అని, వారే మహారాష్ట్రదేశం వదలి తెలుగుభూమిన స్థిర పడ్డారని చెబుతారు. ఈ తోలుబొమ్మల ప్రదర్శకు లకు కొంచెం డొక్కశుద్ధి, వాక్సుద్ధి కావాలి - వుం టుంది. నేటి సినిమాలకు దారిచూపింది నాటి తోలు బొమ్మలాటలే.

యక్షగానాలు : యక్షగాన మనగా ఏమిటి? యక్ష గాన మనగా యక్షులకు సంబంధించిన గానం కాబట్టి యక్షగానం అనవచ్చును.

ఈ యక్షగాన ప్రాచీనపు ప్రదర్శనకళలో మొదటి దిగా ఓబయమంత్రి రచించిన "గరుడాచలం"ను తీసు కోవచ్చును. ఈ యక్షగానాలకు ఎక్కువగా ఆదరణ, పోషణ తంజావూరు రాజుల కాలంలో లభించింది. "గరుడాచలం" యక్షగానం అనంతరం "సుగ్రీవ విజ యం"ను పేర్కొనవలసి ఉంటుంది. చూస్తే ఈ యక్ష గాన పరిణామ క్రమమే వీధినాటకాల రూపం ధరించి ఉంటుంది. ఈ యక్షగాన దశనుంచి వీధినాటకాలు ప్రారంభమై 13 వ శతాబ్ది నాటికే అటు యక్ష గానాలు, ఇటు వీధినాటకాలు సరసనే బహుళ ప్రచారమైనట్లు కనుపిస్తుంది.

అయ్యగారి వీరకవి రచించిన "చిత్రాంగద విలా సము" అను యక్షగాన రచనలో "........చిత్రాంగద విలాస మనగ యక్షగాన మొనరింతు వేషముల్ గట్టి జనులు పాడి వినిపింప" అని పేర్కొన్నాడు. దీనిబట్టి యక్షగాన ప్రదర్శనం రూపంతో వీధినాటక మని బోధపడుతుంది.

"జగ్రాహ్య పాఠ్యం ఋగ్వేదా
త్సామభ్యో గీతమేవచ
యజుర్వేదా దభినయాత్
రసానాథర్వణాదపి,
వేదోప వేదైస్సంబద్ధో
నాట్య వేదో మహాత్మనా,
ఏవం భగవతాసృష్టో
బ్రహ్మణా లలితాత్మకః"

ఋగ్వేదంనుంచి వాచకాన్ని, యజుర్వేదంనుంచి అభినయాన్ని, అధర్వణ వేదంనుంచి రసాన్ని, సామ వేదంనుంచి సంగీతాన్ని గ్రహించిన బ్రహ్మ నాట్య వేదమనే పంచమ వేదాన్ని ప్రవచించినట్లు భరతముని చెప్పియున్నాడు. దీనినిబట్టి వేదాలలోనే రూపక బీజా లున్న వన్నది మనకు బోధపడుతుంది.

ఈ వీధి నాటకాలకు చాలా వయసువున్నట్లుగా అలశాతవాహనుడు రచించిన "గాధాసప్తశతి" చెబు తూన్నదే. రెండువేల యేళ్ళకు పూర్వమే వీధినాటక లక్షణాలు, దేశివాద్య విశేషాలు ఉన్నట్లు నాటి శిల్ప ప్రతికృతుల రూపావశేషాల ద్వారా మనం గుర్తించ వలసి ఉంటుంది.

జగుఃకిలంచ గంధర్వా ననృతు
శ్చాప్సరోగణాః
దేవదుందుభయో నేదుః
పుష్పవృష్టిశ్చ ఖాత్పతత్
ఉత్సవశ్చ మహానాసీ
దయోధ్యాయాం జనాకులః
రథ్యాశ్చజన సంవాదా
నటన ర్తక సంకులాః
గాయనైశ్చ విరాజిణ్యో
వాదనైశ్చ తథాపరైః
విరేజుర్విపులా స్తత్ర
సర్వరత్న సమన్వితాః
ప్రాదేయాంశ్చదదౌ రాజా
సూతమాగధ వందినామ్.

గంధర్వుల మధురగానం, అప్సరసల నాట్యం, దేవ తల దుందుభివాద్యం, వీధులలో నటుల నాట్యం, సూతమాగధ వందీజనుల వాద్యాలను గురించి పైన వర్ణింపబడింది.

నన్నయార్యుని కాలానికి నాటకాదులు ప్రచారం లో వున్న వనడానికి ఒక్క ఉదాహరణము :

"విమల మతిన్ బురాణములు
వింటి ననేకము లర్థధర్మ శా
స్త్రములు తెరంగెరింగితి
నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కుచూచితి, జ
గత్పరి పూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితి ప్ర
కాశముగా హృదయంబు భక్తితోన్".

దీనినిబట్టి ఈ తరహా దేశిరచనలు (బుర్రకథలు, వీధి నాటక రచనలు) రెండు వేల యేళ్ళ క్రితమే ప్రచారం లో వుండి ఉన్నట్లు తెలుసుకోవచ్చును.

నా ఉద్దేశ్యంలో వీధి నాటకాలు, యక్షగానాలు, బుర్రకథలూ-ఇవన్నీ కూడా దేశి సారస్వతానికి చెందిన సంగీత రూపకాలు అని!

అప్పకవి దృష్టిలో "పాటలు గల ప్రబంధం" అయి ఉండవచ్చు. బ్రౌణ్య నిఘంటువులో వీటిని పాటగా పేర్కొన్నారు.

సరే! ఇక శ్రీనాథుని కాలంలో ఈ దేశి రచనలకు చాలా ప్రచారం ఉన్నట్లు తెలుస్తూన్నదే

"కీర్తింతు రిద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి"
అని వివరించి యున్నాడు!

తెలుగునాడున యక్షగానాలు (వీధినాటకాలు) ఉన్నట్లుగానే తమిళదేశంలో "తెరుక్కూత్తు" లని, కన్నడదేశంలో "బయలాటము"లనీ ప్రచారంలో ఉన్నాయి.

ఈ యక్షగాన ప్రదర్శనలు నాడు ఏ రూపంలో వుండేవో చూడండి:

"... ఢక్కాహు డక్కా జర్ఝరల్
ఝల్లరి యాదిగా గలుగు శబ్ద
పరంపర తాలబద్ధమై
యుల్లసిలం ప్రబంధముల
గొప్పగ నాడు దురగ్ర వేదిపై"

తోలుబొమ్మలులో లాగానే యక్షగానాలలోనూ తత్ రూపాంతరములయిన గొల్లభామ కలాపాలు, కురవంజులు మొదలగు వాటిలోనూ కొన్ని కొన్ని పాత్రలు హాస్యరస ప్రధానములే - బుర్రకథలలో కూడా హాస్యపాత్ర తప్పదు. ప్రాచీన కళారూపమైన పగటివేషాలలో కూడా ప్రబోధంతోపాటు, విజ్ఞాన వినోదంతోపాటు హాస్యరసం పోషించబడుతూనే ఉంటుంది.

"పగటి వేషాలు" అన్న పేరులోనే ఈ వేషాలను పగలు ప్రదర్శిస్తారని బోధపడుతూంది. చైనాదేశం లో "కీలుబొమ్మలు" వీటిలాగే చాలా ప్రాచీనమైనవి. ఈ వేషాలకు తగ్గట్లు వేషధారణ, దుస్తులలో, రూపంలో, నడకలో, కట్టులో, బొట్టులో - తీర్చిదిద్దినట్లు తయారయి - ఆ యా వేషాలకు తగినట్లు హాస్యరసంతో నిండిన గొంతుకతో మాట్లాడుతూంటే కడుపుబ్బ నవ్వు వస్తుంది.

ఈ పగటివేషాలు నాలుగు రకాలు - వీటినే జాతీయాలని అంటారు. ఈ పగటివేషాలు పదమూడవ శతాబ్దం నాటికే అమలులో - ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తుంది. ఈ పగటి వేషాలనే విచిత్ర వేషాలు, ప్రచ్ఛన్న వేషాలు అనికూడా పిలుస్తున్నారు.

ఈ పగటి వేషాలను ఆంధ్రలో ముఖ్య ప్రచారకులుగా పల్లావఝుల వెంకట్రామయ్య గారని చెబుతారు.

పోతే, నృత్యం సంగతిని గురించి రెండుముక్కలు పరిశీలిద్దాం - మణిపురి, కథకళి నృత్యాలకు వలెనే కూచిపూడి నృత్యానికీ ఒక ప్రత్యేకత ఉంది. సిద్ధేంద్ర యోగి ఆశీర్వచన ఫలంతో వెలుగొందిన నృత్య సంప్రదాయమే కూచిపూడి నృత్యం. భరతముని చెప్పిన శాస్త్ర పద్ధతులలో భావ, రాగ తాళయుక్తమైన శాస్త్ర కట్టుబాటుతో ప్రపంచ కళాసీమను ఏలారు మన నర్తకులు. ఈ కూచిపూడి నృత్య సంప్రదాయానికి ప్రధానులుగా ముగ్గురు - శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ, శ్రీ వెంపటి వెంకటనారాయణ, శ్రీ చింతా వెంకట్రామయ్య గారలు!

షాజహాను కాలంలో ఈ కూచిపూడి నృత్యాన్ని ప్రదర్శించే జగన్నాథ పండితరాయలు తాత కేశవ భట్టు ముంగండ అగ్రహారాన్ని భరణంగా పొందాడని చెబుతారు.

మొత్తంమీద అడుగులో-(కురవంజి) ప్రారంభమై, ఒక పాత్రతో ప్రాంభమై నడిచే యక్షగాన ప్రదర్శనే బహు పాత్రాభినయంగా రూపొంది వీధినాటకాల రూపం ధరించిందని ఊహించవచ్చును. అయితే ముఖ్యంగా మనం గమనించవలసింది - ఒకటి వుంది. అదే కురవంజి! తెలుగుదేశంలో తొలి నాటకరూపం కురవంజిగా పేర్కొంటారు. కురవలు అనే ఆటవిక జాతికి సంబంధించినదే ఈ కురవంజి! ఈ కురవలూ అనే ప్రాచీన జాతివారు జానపద నృత్యంగా ఈ కురవంజి నృత్యం చేస్తూ ఉండేవారు. ఈ ప్రదర్శనలో నృత్యం, కథ ఒకరే నిర్వహించేవారు. కాని తరువాత వీరూ బహుపాత్రలను ప్రవేశపెట్టారని అర్థం అవుతూంది - దీనికి 'సింగి', 'సింగడు' అనంతరం 'కోణంగి' పాత్రలు సాక్ష్యం!

ఈ కొరవంజి పాత్ర వినోదార్థమే కాకుండా కథా నిర్వహణకు కూడా ఎంతగానో తోడ్పడుతుంది. సంస్కృత నాటకాలలో వచ్చే విదూషకుడు లాంటిదే తెలుగు యక్షగాన నాటకాలలో వచ్చే కురవంజి పాత్ర. తోలుబొమ్మలలో బంగారక్క, జుట్టుపోలిగాడు పాత్రలు ఎలాంటివో, యక్షగాన నాటకాలలో "కొరవంజి" పాత్ర అటువంటిది. కురవంజి అంటే ఎరుకలసాని అని అర్థం. ఈ ఎరుకలసాని పూర్వకాలంలో నమ్మిక కలిగిన జ్యోతిష్కురాలుకూడా! ఈ యక్షగాన రూప పరివర్తనమే నేటి కూచిపూడి భామకలాప ప్రదర్శనం అనుకొంటాను.

## మన ప్రాచీన సంగీతరూపకం – బుర్రకథ!

జానపద వాఙ్మయంగా ప్రసిద్ధిపడసిన జంగం కథలనే బుర్రకథ లంటున్నారు. తెలుగునాడున జరిగిన ఎన్నో గాథలకు, కథలకూ, చారిత్రకాంశాలకు ప్రతిబింబాలుగా నిలచాయి ఈ బుర్రకథలు! తెలుగునాట సంగీత రూపకాలుగా ప్రచారం పొందిన ఈ కథలు చాలా రూపాలలో ఉన్నాయి!

వీరశైవ మతం విజృంభించిన కాలానికే అంటే 1150 నాటికే ఈ జంగంకథలు ప్రచారంలో ఉన్నాయి. ఒక విషయాన్ని ప్రజల మనసులలో హత్తుకు నేలా చేయగల ప్రథానశక్తి ఈ బుర్రకథా తత్త్వంలో ఉంది. ఈ కథలకు ఊతపదాలు తప్పక ఉంటాయి. ఈ కథలను పూర్వకాలంలో ఎక్కువగా చెప్పుకొనేది జంగాలు, జక్కులు, బవనీలు! వీరు ఫలానా ప్రాంతం అని కాకుండా అన్ని ప్రాంతాలలోనూ ఉన్నారనే చెప్పవలసి ఉంటుంది. ఒక తంబుర, తాళాలు, వంతవారివద్ద ఢక్కీలు వీరి కథాపరికరాలు.

పూర్వకాలపు కథలన్నీ చాలా చాలా మహాద్భుతాలతోనూ, వింతలూ విచిత్రాలతోనూ, ఇంద్రజాల మహేంద్రజాలాలతోనూ నిండివుండేవనే చెప్పాలి. అతి ప్రాచీన కథ అయిన కాంభోజరాజు కథనుంచి చారిత్రక కథ అయిన పల్నాటి వీరచరిత్ర వరకు మనకీ విషయాలు వినిపిస్తాయి-కనిపిస్తాయి! అసలు ఈబుర్రకథా తత్త్వాన్ని గురించి ఆలోచిస్తే యక్షగాన మహాప్రవంతి నుంచి పుట్టిన సెలయేరా అనిపిస్తుంది. శ్రీనాథ కవి కాలంలో బుర్రకథా ప్రచారం ఎక్కువగానే ఉన్నట్లు కనిపిస్తుంది. ఈ బుర్రకథలనే జంగంకథలు ఎక్కువగా మంజరీద్విపదలలోనే రచించబడినట్లు తెలుస్తుంది. ప్రస్తుత కాలంలో రగడలలోనూ చాలా కథలు వెలువడినవి. ఈ రచనలలో రగడలే కాకుండా తదితరములైన ఛందోరీతులను కూడా అనుకరించడం మనకు కనుపిస్తూంది. ధేనువకొండ వెంకయామాత్యుని "ఉత్తర గోగ్రహణం" దీనికి నిదర్శనం.

చరిత్రాత్మకమైనవి, సాంఘికపరమైనవి, రాజకీయ విషయంతో కూడినవి, వీరగాథలకు సంబంధించినవి, ఇలా రకరకాల ఇతివృత్తాలతో - రకరకాల పద్ధతులలో నేడు బుర్రకథలను రచిస్తున్నారు. ప్రస్తుత రచనలలో రగడలు ఎక్కువగా వాడబడుతున్నాయి. చిత్రకవి పెద్దనార్యుడు లక్షణసార సంగ్రహంలో రగడలు తొమ్మిదిగానే పేర్కొని ఉన్నాడు. చిత్రకవి తరువాతవాడైన అప్పకవీ రగడలు తొమ్మిదిగానే చెప్పకపోలేదు. అయితే ఛందోదర్పణకర్త అనంతామాత్యుడు మాత్రం రగడలు ఎనిమిదిగా పేర్కొనడం గమనించవలసి ఉంటుంది. అనంతామాత్యుని మతంలో హయప్రచారము, తురగవల్గనము ఒక్కటే!

ఏతావాతా ఒక్కటిమాత్రం నిజం - ఈ బుర్రకథా రచన చాలా రసవత్తరమూ, విజ్ఞానయుతమూ, ప్రబోధాత్మకమూ అయినది. ఈ బుర్రకథల ద్వారా ప్రజలను ఇటే ఆకర్షించవచ్చు! చాకచక్యం కలిగి, కంఠస్వరం బాగుండి అందుకు తోడు సంగీత జ్ఞానంకూడా కలిగుండి - వీర, కరుణ రసాలను ఒప్పిస్తూంటే శ్రోతలు తన్మయత్వంతో మునిగిపోతారంటే అతిశయోక్తి అనిపించుకోదు - అదే బుర్రకథకుని లోని ప్రత్యేకత-ఈ కథలలోని గొప్పతనం!

అటువంటి గుణాలు, సుగుణాలు కలిగిన వ్యక్తి ఆంధ్రదేశంలో సగర్వంగా చెప్పుకోకలిగినవారు శ్రీ నాజర్! స్వంతంగా బుర్రకథలను రచించుకోడం, వాటికి చక్కని రాగతాళాలను మేళవింప చేయడం, తాను ఆ కథను చెప్పగలగడం చేయగల బుర్రకథకుడు నేడు శ్రీ నాజర్ ఒక్కరే! అటువంటి బుర్రకథా ప్రచారకుని, కథకుని ఆంధ్రదేశం గౌరవించడం చాలా గర్వించదగ్గ విషయం - సన్మాన పరంపరలతో జానపద కళాకారుడైన శ్రీ నాజర్ను ప్రోత్సహించడం ఆనందదాయకం - అభినందనీయం!

# అభినందన

శ్రీ 'దీక్షితదాసు'

శ్రీరస్తు నీరుజాయుష్యసిద్ధిరస్తు జయోఽస్తుతే
నాజరాహ్వాయ! త్వాం నిత్యం నటరాజోఽభిరక్షతు

సహజగతిఁదోఁచి ప్రాచీన సంప్రదాయ
బద్ధమగురీతిఁ బారిపార్శ్వక విదూష
కయుగ సాహాయ్యమాత్రాన జయముఁగాంచు
నాజరూ! నీ యుపజ్ఞకు నతులొనర్తు

నాజరు! నీదు బుఱ్ఱకథ నాఁగ మెఱింగి రసంబులన్నియున్
హాజరుపట్టికన్ నిలిచి యద్భుతశక్తి ఘటించు; పాత్రలు
త్తేజములై సజీవముగ దృశ్యవిశిష్టత వెల్వరించుచున్
మోజొదవింపఁ బ్రేక్షకులముందు నటించుఁ గళానుభూతితోన్

వాద్యవిశేషముల్ కృతకవైఖరి నొక్కొన, యంత్రసాధనన్
సేద్య మొనర్చు నిప్పటి కృషీవలురన్ దలపించి యేవియో
పద్యము లెన్నియో సినిమపాటలు ధ్యేయములైన గేయముల్
హృద్యములంచు నెంచి వినిపింపరు బుఱ్ఱకథల్ భవాదృశులున్

వ్రేలున్ మోపుట తంత్రులుండినకదా! విస్ఫారపుం దంబురా
లీలన్ దాల్చి భుజాన, వంతలను మేల్మిన్ బాడి, రాగంబు లె
ట్లాలాపించెదరోయి! బుఱ్ఱకథకుల్? హాస్యాస్పదంబై కళా
శీలం బెట్టి విమర్శపాలఁబడునో చింతింతురే వారలున్

ఔనౌ బుఱ్ఱకథాపితామహుఁడ వీవై, గానసాహిత్య వి
జ్ఞానప్రౌఢిమ హావభావముల విన్నాణంబుఁ దత్తద్రసా
ధీనానూన విశిష్టతన్ నెగడ రక్తిం గొల్పి, ప్రత్యేకమా
స్థానంబున్ గడియించుకొంటివి సభాస్థానంబులన్ నచ్చెలీ!

సమ్మానార్హుఁడ వీవు; భీమవర మిచ్ఛాలీల స్వర్ణాభిషే
కమ్మున్ సేయుచు, గండపెండెరము డాకాలన్ ధరింపంగ నీ
కిమ్మత్తున్ దులఁదూచి యిచ్చెడు; భవత్కీర్తిధ్వజం బాంధ్ర దే
శమ్మున్ మిన్నగ నెంచి చూపినది నాజర్! సాటిదేశంబులన్

గన్నాబత్తుల వంశజన్ములు కళాకారోపపత్తిన్ నిస
ర్గౌన్నత్యంబును గుర్తెఱింగి సతతం బర్చించు సద్భావసం
పన్నుల్ గాన భవత్కృషిఁ దెలిసి విద్వన్మాన్యుగా స్వర్ణపూ
జ న్నీపాత్రీభవమున్ వెలార్చుకృతి సాజంబౌను ముమ్మాటికిఁ

అరితిన్ నేఁడు జవాదివంశమణి లక్ష్మయ్యార్యుఁ డధ్యక్షతా
భరమున్ బూని రసానుషంగమతి సంభావించి నిఁ గండపెం
డెర సన్మానితుసేయు రాణ నొడఁగూడెన్ నాజరూ! మేల్మి బం
గరుకున్ దావి; కళాసరస్వతి భవత్ఖ్యాతిన్ బ్రపంచించుతన్.



ప్రాచీనయుగంనుండి

# కళలు - ప్రజలు

- శ్రీ నాజరు

శ్రీశైల వేదాద్రుల వంటి పర్వత గుహలయందు ఘోర అడవులయందు వేటయే వృత్తిగాగల తెగలు, పశుపాలనే వృత్తిగాగల తెగలు వృద్ధిచెందిన ప్రపంచమందు భారతీయులు నాట్యమే వృత్తిగాగల తెగకు చెందియున్నారు. హాస్య, శాంత, అద్భుత రసములతో నిండిన ద్వంద్వార్థ పదముల కలగాపులగముతో నిండిన నాట్యకారులు భారతీయులు. (ఆంధ్ర వాచస్పత్యము) ఈనాడు జానపద నాట్యమని, భరతనాట్యమని, శాస్త్రీయ అశాస్త్రీయ నాట్యమని తలకొకరీతి పిలవబడుచున్నది. కనుక అసలు నాట్యమన నేమి? ప్రజలకు నాట్యమునకు ఉన్న సంబంధబాంధవ్య మెట్టిది? ఏది శాస్త్రీయము మొదలగు అంశములను గురించి వివరణ ఎంతైన అవసరము.

## నృత్తము మానవుని శైశవదశ

శ్లో॥ కలిః శయనోభవతి సంజహా నస్తుద్వాపరః
ఉత్తిష్ట త్రేతాభవతి కృత సంపద్యతే చరన్

కృత అనగా కదలుట, లేక దోగాడుట, త్రేత లేచి నిలుచుండుట. ద్వాపర, మెల్లగా అడుగులు వేయుట, కలి నిదురబోవుట లేక పరుండియుండుట - (ఐత్తరేయ బ్రాహ్మణం) ఈ వేద నిర్ణయాన్ని తమ సహజ నాట్య భంగిమలలో ఇలా ప్రతిబింబించారు భారతీయులు.

శ్లో॥ మత్స్య కూర్మ వరాహశ్చ నారసింహశ్చవామన

జీవం మత్స్యముగా కూర్మముగా, నారసింహముగా, వామనముగా పరిణామము చెందెను. ఈ నిర్వచనాన్ని నేటి జీవశాస్త్రవేత్తలు ఇలా నిర్వచిస్తున్నారు. జలచరము, ఉభయచరము, వనచరము, భూచరము అని డార్విన్ మొదలగు జీవశాస్త్రజ్ఞులు అంటున్నారు. ఆసియా నడిగడ్డపై వృద్ధిచెంది ఈజిప్టు మీదుగా ఆఫ్రికా ఎడారులకు పయనించిన మరగుజ్జే వామనుడని నా అభిప్రాయము.

ఏదశలోనైనా భూమిమీద జన్మించి బ్రతకాలంటే పనిచెయ్యాలి. ఆత్మరక్షణ చేసుకోవాలి. అవయవ నిర్మాణము మెదడు మిగిలిన జీవులకన్న, మృగాల కన్నా భిన్నంగా సంక్రమించిన వానరుడు వెనుక కాళ్ళపై నిలిచి ముందు కాళ్ళను చేతులవలె ఉపయోగిస్తూ తొలిసారిగా వేసిన తప్పటడుగులే నేటి మన నృత్తానికి, నృత్యానికి, నాట్యానికి యక్షగానానికి బుర్రకథకు మూలం. తన ఆహార ఆత్మరక్షణ ప్రయత్నాలలో కలిగిన మనోవికారములను ముఖములో, నడకలో, నడతలో ప్రదర్శించు ధ్వని అనుకరణ. అంతగా చేతగాక, మాటలురాక తన ఆవేశ ఆర్భాటాలకు అనుగుణంగా చిందులు గంతులు కుప్పిగంతులు వేస్తూ రెట్టలు దట్టుచూ పిడికిలి బిగించుచూ పిల్లిమొగ్గలు వేస్తూ అంగికాభినయానికి నాందీగీతం ఆలాపించాడు. ఈ మృగయుడు కాలగమనంలో గర్భశత్రువుగా వృద్ధి పొందిన వరాహమును ఒక్కడుగా ఎదిరించి రాతితోను, ఎదురుతోను, ఎముకతోను తానుగా తయారుచేసుకొన్న ఈటెతో కుమ్మి, చిమ్మి, తాండవమాడి పరమశివునకు వారసుడుగా నిలిచాడు. శివుడనగా "అంగమొలవేల్పు" అకులుగట్టినవాడు. (నిఘంటువు) నాటిదశను.

శ్లో॥ రసభావ విహీనంతు నృత్తమిత్యభిధీయతే
(అభినయ దర్పణం)

రసభావములు లేనిది నృత్తము.

## నృత్యము - మానవుని మాధ్యమికదశ

జీవి వృద్ధిపొందిన కొలది మేధస్సు పెంచుకొన్నది. మానవస్థితి కొచ్చేసరికి ప్రకృతి శక్తులకు బానిసగా ఉన్న తాను ప్రకృతి శక్తులను తన కనుకూలంగా

మార్చుకొనేందుకు చైతన్యపూర్వక ప్రయత్నము చేయసాగెను. అందుకు అవసరమైన అన్వేషణలు, అనుకరణలు చేయుచుండెను. కర్రను కర్రతో రాపిడిపెట్టి నిప్పును చేయటం మొదలు నీలిమేఘాలు గని పురులు విప్పి ఆడే నెమళ్ళను, చీమ చిటుక్కుమంటె చిందులు గంతులు వేసే లేడిగుంపులను, మేఘ ఘర్జనలను వాలు గాలికి మ్రోగే పురుగులు తొలచిన బొంగువాదాలను క్రూరమృగముల తర్జన భర్జనలను మృదువైన కోయిల గానాలను యిల్లెన్నిటినో అనుకరించే జ్ఞానాన్ని వృద్ధి పొందించుకొనెను. అందుకే కళలకు అనుకరణ ఆది అన్నారు లయాత్మకంగా చప్పట్లు చరుస్తు కర్రముక్కలపై దరువులు వేస్తు కళాత్మకమైన వీటన్నింటిని సమన్వయ పరచి తన నృత్తానికి రసపుష్టిని భావగంభీరతను సమకూర్చుకొనెను. కాలచక్రం కుమ్మరి సారెవలె తిరిగింది. చప్పట్లతోను, కర్రముక్కలపై దరువులతోను ఉన్న నృతికారులు దూర దూరములనుండి క్రూరజంతువుల చంపిన బాణమును కొద్ది మార్పులతో 'నంతోశా' అను తంతివాయిద్యాన్ని తయారుచేసెను. తాను నీళ్లు త్రాగేందుకు ఉపయోగించిన సొరకాయతో నాగస్వరము తియారుచేశాడు. తనకు అనేకవిధాల ఉపకరించే ఎదురుతో పిల్లనగ్రోవి లావుపాటి యెదురును చిన్న చిన్న తుంటలుగా చేసి చర్మాలు మూసి జమిలిక, ఢక్కా, ఢమరుకం ఇలాంటి వెన్నో చర్మకట్టు వాయిద్యాలను తియారుచేసాడు. వేడి పదార్థాలు వడ్డించుకొనే గరిటెలాంటి కొబ్బరిటెంకకు పైభాగమును చర్మమును మూసి ఏకతార వాయులీనము లాంటి వాయిద్యాలను తయారుచేశాడు. ఇట్లు తన ఉదరపోషణకు ఉపయోగించిన వస్తు సముదాయముతో, తన నృత్తానికి ఉపకరించు వాయిద్యములను తయారుచేసుకొనెను. అనగా ఒకేవస్తువు రెండు పనులకు ఉపకరించెను. అంటే నృత్యము జీవిత చిత్రణగాను వాయిద్యాలు జీవిత-ఉపాంగాల ప్రతిబింబాలుగాను రూపొందించుకొన్నాడు. అంటే నృత్యానికి జీవిత పరిణామక్రమం అంతఃప్రాణములుగా వృద్ధిచెందినవన్న మాట. ఈ పరిణామం ఒక్క క్షణములో జరిగి-ది గాదు. కొన్నితరాలు గడిచాయి. ఏ క్షణములో జీవి, ప్రకృతిశక్తులను తన కనుగుణంగా మార్చుకొనేందుకు చైతన్య పూర్వకంగా ప్రయత్నం చేసిందో అదే నాగరికతా జననం. ఆనాడే శాస్త్రం విజ్ఞానం జనించాయి. అంటే నృత్తకారుడు ఒక శాస్త్ర మన్నమాట. ఒక నృత్తకారుల తెగ ఒక సజీవ గ్రంథాలయ మన్నమాట. అంటే లిపి పుట్టిన తరువాత భూర్జరపత్రాలు, తాటియాకులు, రాతి కుపకరించిన తరువాత, ఈ నృత్తకారుల నాలుకలపై నున్న శాస్త్రాలను ఆయా పత్రాలమీద లిఖించటం జరిగింది. కనుక లిపి పూర్వకముగా నున్నదే శాస్త్రమని శాశ్వత సత్యమని అనుకోవటం సరైన పద్ధతి కాదు. లిపి పుట్టక ముందే శాస్త్రం పుట్టింది. అందుకు వేదమే సాక్షి. తొలి సాహిత్య భాండమైన వేదానికి శ్రుతి యని పేరు. శ్రుతి యనగా వినిపించినది. కనుక లిపి పుట్టక ముందే వేదము పుట్టింది. భరతుడు పుట్టకముందే భరత శాస్త్రం పుట్టింది. అంటే భారతీయులు భరతశాస్త్రం సృష్టించుకొన్నారు గాని, భరతశాస్త్రం భారతీయులను సృష్టించలేదు. అందుకు భరతుడే సాక్షి.

శ్లో॥ ఋగ్యజు సామ వేదేభ్యో వేదాచ
అధర్వణాత్రక్కమాత్
వాధ్యంచ అభినయం గీతం....

(భరశాస్త్రము)

ఋగ్వేదము నందున్న వాద్యము, యజుర్వేదమున నున్న అభినయము, సామవేద మందున్న గానము, అధర్వణ వేద మందున్న రసమే నాట్యశాస్త్రము. మానవ పరిణామక్రమ చరిత్రలో మనకున్న నృత్తశాస్త్రము కొన్ని పుటలు మాత్రమే. కనుక ప్రజలతో వృద్ధి పొందుతూ వచ్చిన కళారూపాలను పిచ్చిగుంటలు కథలని (పిచ్చిగుంటలు అల్లరిపిల్లలు) గొల్లసుద్దులని కించపరచుకొని మనకు మనమే అన్యాయం చేసుకొంటున్నాము. చూడండి హిందుస్తానీయులకు హిందూస్తానీ సంగీతము, బెంగాలీలకు బెంగాలీ చరిత్రము, కర్నాటీయులకు కర్నాటీ సంగీతము అంటూఉంటే ఈనాడు ఆంధ్రులకు మధురగానములని చెప్పబడిన జానపదాలను కర్నాటక సంగీత బాణీలలోనికి దిగజార్చుకొనుచున్నాము. అంటే ఆంధ్రులకు ప్రత్యేక సంగీతమంటూ లేదన్న మాట. ఇట్లు నానాటికి మానవాళి అభివృద్ధి చేసుకొన్న నృత్తాన్ని

శ్లో॥ రసభావ వ్యంజకాదియుతం నృత్య మితీర్యతే....

అనగా రసము భావము కూడియుండినది నృత్యము (భరత రస ప్రకరణము). ఈ దశలోని నృత్యమునే కురవంజి అన్నారు. కొండజాతి కోయలు, కురవలు, చెంచులు, ఎరుకల, యానాది మొదలగు అనాది అనాగరికుల తెగలకు చెందినవారి, సమిష్టి నృత్యమే కురవంజి. ఇందు గేయభాగము తక్కువ. నృత్తభాగము ఎక్కు

వగను యుండును. (వేటూరు ప్రభాకరశాస్త్రి సుగ్రీవ విజయం) ఇట్లు నృత్యమందు కొద్దో గొప్పో పాడబడిన గీతమందున్న అర్థమును కాని, ప్రశ్నను కాని ప్రతిబింబించుటయే నాట్యము కాదు. (భరతశాస్త్రము)

## నాట్యము - మానవుని ఉన్నతదశ

శ్లో॥ నాట్యం తన్నాటకేష్వేవాయోద్యం పూర్వ
కథాయుతం

తాను ఆలాపించే గీతమునకు ఏదైనా జరిగిన జీవిత గాథను యితివృత్తంగా చేసుకొని పాత్రల అవస్థలను ప్రతిబింబిస్తూ భావనియమము, ఛందోఅలంకార నియమము, ఆహార్యాది నియమములను పాటించేదే నాట్యము. (భరతశాస్త్రము) గానమన నేమి ?

శ్లో॥ గీతవాదిత్ర నృత్యానాంత్రయం సంగీతముచ్యతే

అనగా గీతము వాయిద్యము నృత్యముల కలయికయే గానము. (సంగీత విద్యాదర్పణం)

అంటే గీతము, స్వరము, రాగము ఈ మూడును నాదమును విడిచి యుండవు. కనుక పూర్వగాథలతో కూడిన గీతములు నాదాత్మకములు. వాయిద్యము నాదముయొక్క వివరణచే ప్రకాశించును. ఇక గీత వాయిద్యముల ననుసరించి నృత్యము నడచును - కనుక గాథ వాయిద్యం నృత్యములు-నాదాధీనములు. ఈ నాదము వలన అక్షరము అక్షరమువలన పదము పదము వలన వాక్యము వాక్యము వలన లోక వ్యవహారము. సకల చరాచరములతో నిండిన లోకమును ఆ లోక సృష్టికి మూలములైన పంచభూతములను ఈ పంచభూతాత్మకమైన బ్రహ్మను ఆలాపించి ప్రతిబింబిస్తూ వృద్ధి చెందినదే గానమూ లేక నాట్యము—

# యక్షగానమననేమి ?

శ్లో॥ ఓం సజ్జోజాత వామదేవ అఘోర తత్పు
రుష ఈశాన పంచముఖాన బ్రహ్మ.

అనగా నిప్పు నీరు గాలి భూమి ధ్వని (అనగా ఆకాశము) ఆ అయిదింటిని పంచభూతములందురు. ఇట్టి పంచభూతాత్మకమైన లోకాన్ని బ్రహ్మ అన్నారు. పూర్వులు పంచభూతములనబడే ఈ నిప్పు, నీరు, గాలి, ఆకాశము, భూమి వీటి తత్వాన్ని నిర్వచించిన అది నాట్యమో లేక గానమో. యక్షగానం ఆంధ్ర వాచస్పత్యములో ఇలా వున్నది.

"పదపదార్థ విజ్ఞాన ప్రబోధకులు యక్షులు" యక్షులనగా పుణ్యజనులు. పదమనగా భూమి. పదార్థమనగా వంటయింటి సరుకు. మట్టినుండి పుట్టిన ఆహార పదార్థములు గాలి, ధ్వని, నిప్పు, నీరు. అనేగదా? కనుక ఆనాటి కళాకారులు వ్యవహార సౌలభ్యం కొరకు పంచభూతాలకు పేర్లు పెట్టారు గాని స్వరూపాలు నిరూపించలేక పోయారు. మానవాకృతిలో ఉన్న తాము ఏవో కొన్ని మానవ విభిన్న వేషాలతో భంగిమలతో మానవులకు వాటి అవసరాలను బోధించుట చేత వీరిని యక్షులనియు వీరు ఆడి పాడిన నాట్యాన్ని లేక గానాన్ని యక్షగానమని అన్నారు.

మనిషి తను బ్రతకాలంటే, పనిచేయాలంటే పంచభూతాలనబడే ఈ నిప్పు, నీరు, గాలి, ధ్వని, భూమి ఎంత అవసరమో తెలుసుకొన్న తన వారికి తెలియపర్చుతున్న నాట్యకారులు. అంటే ప్రకృతి శక్తులను జయించుచున్న నాట్యకారులు తమతో వృద్ధిపొందుతున్న పశు, పక్షి, మృగాలలో తనకు శత్రువుగా తన కెదురుతిరిగిన క్రూరమృగమైన వరాహమును ముందుగా ఒక్కడుగా ఎదిరించి రాతి ఈటెతోను ఎదురు ఎముక ఏనుగు దంతములతోను తయారు చేసుకొన్న మూడు మొనలుగల ఈటెతో చంపి ప్రజల భయాన్ని దీర్చిన ఆకులం గట్టిన, లేక చర్మములు ధరించిన ఆవీరుడే నేటి మతాలకు మూలం. ఆరాధ్య దేవుడని నమ్మిన ఆమూఢ నమ్మకమే ఈనాటి మతం. కాలగమనంలో మానవుణ్ణి అనేక ప్రశ్నలడిగింది మనస్సు. భూమిలో ధాన్యాన్ని పండించావు. మట్టితో కుండను చేశావు, పంచభూతముల ఆధారముతో అన్నాన్ని నీవు తయారు చేశావు. నీకీ పంచభూతములను తయారు చేసిపెట్టినవాడెవడు అని ప్రశ్నించింది మనస్సు.

ఈ ప్రశ్నకు ఆనాటికి ఈనాటికి సమాధానం తెల్పలేని మతం పంచభూతముల సృష్టికి మూలమేమిటో తెలియక తికమకలు పడిన మతం. తన ఉనికిని పదిలపరచుకొనేందుకు పంచభూతముల సృష్టికి మహాశక్తి కలదనియు అదే భగవత్ స్వరూపమనియు సృష్టికి మూలాధారమనియు నిర్వచించి సహేతుకమైన మానవ పరిణామ క్రమాన్ని ప్రతిబింబిస్తున్న కళలను తార్కిక భౌతిక పరిస్థితులకు భిన్నంగా ఊహాజనిత వాదానికి నిలయంగా కళారూపాన్ని మల్చుకో సాగింది మతం.

దీనితోపాటు మరో మార్పుకూడా జరిగింది. అదే

రాజ్యాంగ యంత్ర నిర్మాణం. ఈ రాజ్యాంగయంత్ర నిర్మాణం జరుగకముందు ప్రతివాని ఆస్తి అతని స్వార్జితము. ఆస్తి యనగా ఆహారపదార్థాల కుపకరించేపని ముట్లు. వాటిని పోలిన వాయిద్య పరికరాలు ఆనాటి మానవుని ఆస్తి. రానురాను సహకారసత్వాల పేరుతో, దానాల పేరుతో ధర్మాల పేరుతో స్వార్జితం కాని ఆస్తి కొందరికి అదనంగా సంక్రమించటం జరిగింది.

ఆస్తికలవారు ఆస్తి లేనివారుగా విభజన జరగటం ఆస్తికలవారికి ఎక్కువ హక్కులు కావల్సి రావటం ఆస్తిలేనివారినుండి రక్షణ కావల్సి రావటం మొదలైన కారణములచే రాజు, రాజ్యాంగ యంత్రము రావటం జరిగింది. గత తార్కిక భౌతిక పరిస్థితులకు భిన్నంగా ఊహాజనిత వాదానికి నిలయమైన మత ప్రవక్తలు రాజులు తమ ఉనికిని కాపాడుకొనేందుకు అప్పటి వరకు మానవ జీవిత ప్రతిబింబాలైన కళలను ఆనాటి నుండి మతము కొరకు రాచరిక ప్రయోజనముల కొరకు ప్రచార సాధనములుగా ఉపయోగించుకో సాగిరి. ఆ క్షణమునుండి ఆస్థాన కవులు ఆస్థాన కళాకారులు జానపద కళాకారులుగా గణములు చీలినట్లే కళలు కూడా చీలి ఒకదాని నొకటి త్రోసి రాజనే స్థితికి వచ్చెను. ప్రకృతి శక్తులను సంపదలనూ మానవోపయోగాలుగా మలిచే విధాన నిరూపకులు బోధకులైన జానపద కళాకారులు మనిషికి ప్రకృతి శక్తులకు ఉన్న సంబంధాన్ని అవసరాలను తెల్పే జానపదాలూ ఒక వంకా-వ్యక్తి స్వేచ్ఛ పేరుతో స్వార్థాన్ని వృద్ధిచేసి 'నాదీ! నేనూ! అనే అహంకారాన్ని కామాన్ని వృద్ధి పొందించే సారస్వతం అందుకనువైన కళారూపాలూ ఒకవంకా! వీటికి ఆదరణా, జానపదాలకు అనాదరణ వృద్ధి పొందసాగెను.

## బుర్రకథ అననేమి?

అంతవరకు ప్రజల జీవిత చిత్రణగా వృద్ధిపొందిన వానర నరుని నృత్తము కురవంజి నృత్యగానము గేయ భాగమును పెంచుకొని యక్షగానముగా రూపొందెను. యక్షులనగా పుణ్యజనులు. ఆ యక్షులు పాడుతూ ఆడిన పదపదార్థ పర్జ్ఞానరూప చిత్రణయే యక్షగానము (పదమనగా భూమి పదార్థమనగా పంటయింటి పరుకు ఆంధ్ర వాచస్పత్యము) అనగా ప్రకృతి మానవ సంఘర్షణ సజీవ చిత్రణే యక్షగానమన్నమాట. కురవంజి నృత్యమందున్న ప్రధాన పాత్రధారులైన సింగి, సింగడు కోణంగి యక్షగానమునందు కథకుడుగా, కోణంగిహాస్యముగా సింగడు అనగా, విదూషకుడు (విద్ అనగా తెలుసుకొనుట) - విదూషకుడు వివరించువాడుగా రూపొందిన ఈ యక్షగానమునకు ప్రజలు పెట్టినముద్దు పేరే బుర్రకథ. ఇందుకు ఆడ, మగ, ప్రతిబింబమైన కథకుడు బుజాన వున్న బుర్ర వంతల పూరుషులు పైనున్న లేక మెడనున్న రెండు బుర్రలు (గుమ్మెటలు) బుర్రకథ అని ప్రజలు పేరుపెట్టేందుకు కారణభూతములై వుండవచ్చును. దీని స్వరూప చిత్రణ అప్పకవియిలా వర్ణించాడు.

తుద నేడు లఘువులు తొలగించి చదివిన
త్రిపుటకు వృషభగతి పదయుగము
లలిగడపల నొక్క లఘువు మానిన జంపె
మనుద్విరదగతి సమపదయుగము
గురుతగు రచ్చెరకు దురగవల్గ నా
హ్వాయ మేకతాళి యామధురగతికి
అంగ్రి కిర్వగి నాలుగిట తాళమున
మాత్రలారెలి విశ్రాంతి పద్యాలుగింట
తెలియ సర్గంబు సర్గచంద్రికల వీన
యక్షగాన ప్రబంధంబు లతుకవచ్చు
రగడ భేదంబు లివియంద్రు రసకవీంద్రు
(అప్పకవీయము) వృషభగతి రగడయననేమి ?

కపికులోత్తము నాకు చూడగ
కపట వేషము కానరానిది
(సుగ్రీవ విజయము కందుకూరి రుద్రకవి)

ఈనాడు ఆచరణలోనున్నది.

రాయుడొచ్చే ధాకలాకు
కొంగలే కోలాట మేసె
(సర్వాయి పాపడు) బుర్రకథ

ఇక రెండవ ద్విరదగతి రగడ

వనచరోత్తము లెల్లవచ్చి-మంచి
దినము చేకొని నన్ను దెచ్చి (సుగ్రీ-కం)

ఈనాడు కనుపిస్తున్నది (బుర్రకథ)

ఓరామ రాఘవా నేడు—ఘలిఘలీ
శ్రీరామ రాఘవా నేడు
(జానకీ వనవాసము లేక లవకుశ)

మూడవదైన తురగవల్గము

ముక్కులు చెక్కులు మూపులు వీపుల్
ప్రక్కలు పిక్కలు బరులును దరులున్ (సుగ్రీ-కం)

ప్రస్తుతము కనిపిస్తున్న బుర్రకథ
మందులు మందులు మందులంటడే
మహావ్యాధులకు మందులంటడే (శరాబందిరాజు)
నాల్గవదైన ఆటతాళము
కపికులోత్తమా నాకుచూడగా కపటవేషమోగా
ప్రస్తుతమున్న బుర్రకథ (సుగ్రీ-కం)
శ్రీధేనువగిరి ధామా యదుకుల క్షీరాంబుధిసోమ
(ధేనువుకొండ వెంకయ్యగారి విరాట్ పర్వము)
అయిదవ అర్ధచంద్రికలు
కపికులోత్తమ నాకుచూడగన్
కపటవేషము కానరాదిదిన్ (సుగ్రీ-కం)
ప్రస్తుతమున్న బుర్రకథలు
ఉత్తరాది యాభూమే అమ్మయ్య
అందమైన లింగాల పురములో (లక్ష్మమ్మ కథ)

ఇట్లు ఇవేకాదు. అర్ధచంద్రికలు అనేక పణుతులలో కనిపిస్తున్నవి. గ్రంథస్తంగా కనిపిస్తున్న వీటి అన్నిటికి మూలపణితి ఈనాడు ప్రజలలో ఏవిధంగా కనిపిస్తున్నదో చూడండి. ప్రాచీన కురవంజి నృత్యకారుల కోవకు చెందిన చెంచులు కోయలు పాడే పణుతులు

ఏవూరు ఏభామా తందానా
ఎవ్వారి దానవే వైభామా
చేతెడే ముద్దమ్మా తందానా
చేయెత్తి దానాలు వైభామా
వడ్డిచ్చెతల్లా వడ్డిచ్చెతల్లా (చెంచులు)
మోకాళ్ళ నొప్పులికి
వాతనొప్పులకి (కోయలు)
అమ్మా నేనింతగల్ల శ్రద్దనే....ఈ
నేనింటనే యున్నానే....ఈ

ఇట్లనేక విధాల ప్రజల్లో కనిపిస్తున్న లేక భరతుడు నిర్వచించిన కురవంజి యక్షగానములనుండే గాంధర్వ దేవగానము ఉద్భవించెను. కామాన్ని నియమబద్ధంగా తీర్చుకొనే రీతిని నీతిని ప్రబోధించినదీ గాంధర్వ గానమనియు కీర్తింతురెద్దాని కీర్తిగంధర్వులు.

"గంధర్వ గానము యక్షగాన పణితి"

అన్నాడు శ్రీనాథుడు. ఇంక దేవగానమన ముక్తి మోక్షాన్ని ప్రసాదించే సేవని భ్రమింపచేసిన మతం యొక్క కల్పిత గాధల బోధలే దేవగానం.ఇట్లు మానవ పరిణామ క్రమములో నృత్యముగా, నృత్తముగా నాట్యముగా, లేక గానముగా రూపొందించుకున్న యక్షగాన కళారూపమునుండి పదములను శిల్పమును పుణికి పుచ్చుకొని కాయనుడు, భాసుడు, కాళిదాసు మొదలగు మహాకవులు నాటికల, నాటకముల, భాణికముల వంటి వనేకములు సృష్టించిరి. భరతుడు నాట్యశాస్త్రము సృష్టించెను. ఈ పరిణామ క్రమము 16వ శతాబ్దము నాటికి శ్రీ పురందర విఠల్ దాసుగారిచే సంగీత శాస్త్రాన్ని తయారు చేసేందుకు ప్రోత్సహించెను. ఆయన మానవుడు తన అవస్థా భేదాన్ని తెలుపుకొన్న నాదాన్ని ఒకచోట స్థిరపరచి—సరిగమ పదని అను సంజ్ఞాక్షరాలకు స్వరభేదాలను ఏర్పరచెను. వాటి అనుకరణా విధానమునకు ఉపయోగకరముగా కొన్ని పక్షుల, జంతువుల స్వరాలను ఉదహరించెను.

శ్లో॥ షడ్జం మయూరో వదతిగావో ఋషభభాషిణః
అజావికంతు గాంధారంక్రౌంచః కణ్వతి మధ్యమమ్

శ్లో॥ పుష్పసాధారాణె కాలేపికః కూజతి పంచమమ్
ధైవతం హేషతేవాం నిషాదం బృంహతే గజః

ఇట్లు స్వరములు, జంటలు, అలంకారములు, గీతములు, వర్ణములు, రాగములు తయారు చేసెను. ఈయన కర్నాట దేశీయుడగుటచే కర్నాట సంగీతముగా ఇది పిలువబడుచుండెను. ఈయన కర్నాట సంగీత పితామహుడుగా చరిత్రలో నిలచెను. ఇట్లు వివిధ రూపురేఖలతో ఈ యక్షగానము ప్రబంధయుగములో ప్రవేశించినది. ఈప్రబంధ కవులు కళాకారుల ప్రచార సంగీతానికి, సాహిత్యానికి, నృత్యానికి మూల పణుతులు కురవంజి యక్షగానముల నుండే తీసుకొన్నారు. అంటే జానపద నృత్య నాట్యములనుండే ప్రబంధ కవిత్వం కళలు పుట్టాయి. అది యెలాగో నాకు తెలిసినంతవరకు వివరిస్తాను. అది అనాగరిక జానపద నృత్యనాట్యకారుల కోవకు చెందిన చెంచులు, కోయలు మొదలైన కొండజాతి మన యింటి ముందుకు భిక్షుకు వచ్చి ఏమని పాడుచున్నారో చూడండి—

ఏవూరు ఏభామ తందానా
ఎవ్వారి దానవే తందానా
యిదే పణితిలో ద్విపద అని పేరున
భారతాది కథలు
చీర మరుంగల
సారంగ బొమ్మలా
నాడించువారూ

(పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో యిలా వ్రాశాడు)

రతిరాజసుందరా
రణరంగధీరా
నాగమ్మ తలగొట్టి
నలగాము బట్టి

(శ్రీనాథ మహాకవి పల్నాటి వీరచరిత్రలో)

యిక పద్యాలు

ఏవూరు ఏభామ ఎవ్వారి దానవే
మందార మకరంధ మాధుర్యమునదేలు.
అన్నాడు పోతన మహాశయుడు

ఏవూరు ఏభామ-ఎవ్వారి దానవే
కవిరాజుకంఠంబు-కౌగలించెనుగదా
ఏవూరు ఏభామ-తాన దాన (తంధానా)
పురవీధి నెదురెండ-పొగడదండ (శ్రీనాధుడే)

ఆ ప్రాచీన కురవంజి కోయల ఘణుతులనే అనుకరిస్తూ విద్యగలవారు నూతన భాషా రూపములను రూపొందించారు. అయితే ప్రబంధయుగంలో భాష వృద్ధిచెందితే చెందినదేమో కాని ప్రాచీన కళలను సారస్వతాన్ని ఏరుదాటి తెప్పతగలబెట్టినట్లు చూడడం జరిగిందని నా యభిప్రాయం. అందువల్లనే ప్రబంధయుగంనుండి జానపద కళారూపాలకు ఆదరణ తగ్గిపోవడం జరిగింది. అంటే ప్రత్యేకతను ఆశించువారెవరైనా ఎప్పుడైనా జనసామాన్యము వాడిన రూపములను, భాషలను అవేసరియైనవైనా వాడికేమోనని అనిపిస్తున్నది. ఏ ఏమైనా కళ కళకోసమా? కళ ప్రచారం కోసమా? అదేవాదన ఉత్పన్నమైనది. మతమూ, రాజరికమూ వచ్చిన తరువాతనే న్యాయంగా కళ కళకోసం గాదు. కళ ప్రచారం కోసం గాదు. మానవ పరిణామ ప్రతిబింబమే కళ. జాతి సజీవశాస్త్రి విజ్ఞానమే కళలు, సారస్వతం మానవుడు పంచభూతాలను తెలుసుకొన్న జ్ఞానమే శాస్త్రిమని, అట్టి నిప్పు శాస్త్రాన్ని నీరు శాస్త్రాన్ని, భూమిశాస్త్రాన్ని, వాయుశాస్త్రాన్ని ధ్వని శాస్త్రాన్ని సమన్వయ పరచి మానవ జీవిత వికాసానికి సమగ్ర స్వరూపాలను రూపొందినవే సారస్వతము కళలు ఏదేశమునకైనా కీలకం ఆదేశ ప్రజా కళలను కరతలా మలకం చేసుకోవటంలోనే వుంది. ఇట్టి కీలకమైన కళలు తమ నిజస్వరూపాన్ని కోలుపోయి అశాస్త్రీయమైన మతాన్ని రాజరికాన్ని ప్రచారము చేయసాగెను. కాని కాలగమనంలో [stamp] రాజరికాలు మారటం వాటితోపాడు [stamp] భజనలు చేసిన కళారూపాలు చిందరవందర [stamp] గుతూ వచ్చెను. ఈనాడు కళలు కాంగ్రెసు [stamp] కమ్యూనిస్టుపార్టీ, బ్లాకుడెవలప్‌మెంటు ఇటు అధికార అనధికార రాజకీయ పార్టీలను, పురాణాలను, మతాలను పట్టుకొని ప్రాకులాడుచుండెను. కాని ప్రాచీన కళారూపాల నిజస్వరూపాలను తెలుసుకొనేందుకు చెంచులు, కోయలు మొదలగు జాతుల వంశపారంపర్య వృత్తి గీతాలు పాడక జనుల నాలుకలపైనున్న జోల పదాలు ప్రజల ఉయ్యాల జోలలు యీలలు నూర్పిళ్ళ పదాలు మొదలైనవి చెప్పక చెప్పుచున్నవని నా అభిప్రాయము.

(యక్షగానములందు చెలయు పదములు)

పదాలు, వెన్నెల పదాలు, నివ్వాళి పదాలు, దరువులు, ఏలాలలు, జోలలు, ధవళములు, మంగళహారతులు, శోభనంబులు, వుయ్యాల జోలలు, జక్కులరేకుల పదంబులు, చందమామ సుద్దులు (లక్షణదీపిక)

## నాగరిక మానవుడు కళలు

కర్రకు కర్ర వొరిపిడి పెట్టి నిప్పుచేసే అనాగరిక మానవుడు కాడు నేటి మానవుడు. పంచభూతాలను బొమ్మలనువలె తనకనుకూలంగా ఆడిస్తున్న నాగరిక మానవుడు. చంద్రమండలాలకు ప్రయాణము చేస్తున్న ఈ మానవుడూ? ఇతడూ బ్రతకాలి ఆత్మ రక్షణ చేసుకోవాలి. కానీ మానవ పరిణామ క్రమములో ఎదురైన వరాహము, సింహము, ఏనుగు మొదలైనవికావు ఈనాటి ప్రజాశత్రువులు. కనుక ఈనాడు మనం చూపిస్తున్న నాట్య భంగిమ లేమిటి. అఘుంతెరత, మత్స్యావతారా, జంతికు రేకేణు, వరాహావతారా, తడికుడికికు కూర్మావతారా అని చిత్రిస్తున్నాం ఇది భరతశాస్త్రి సమ్మతమే. కాని భరతుడు ఎప్పుడు చెప్పాడు? వేద కాలము నాటి ముందున్న మానవ పరిణామ క్రమాన్ని చెప్పాడు చూడండి భరతశాస్త్రిములో యెలారూపొందించాడు. 1 బాణము, 2 దాణిక, 3 వుద్ధతము, 4 ప్రస్తానము అనగా వరాహ సింహాదుల వర్ణించు స్నేహపూర్వకమైన అంగవిన్యాసవైతిత్యమే బాణము. గజాదుల చంపువిధమును అనుకరించుట ప్రస్థానము. స్నేహమును ప్రదర్శించుట వుద్ధతము. శూకర సింహ జనితమైన క్రీడ. బాణిక భరతశాస్త్రము. కనుక ఆనాటి

ఆటవిక జీవుల అనాగరిక జీవుల ఆహార ఆత్మ రక్షణా రూప చిత్రణాలను ఈనాటి నాగరికులముందు ప్రదర్శించుచున్నాము. ఆనాటి శత్రువులు మానవునకు మృగములు. మరి ఈనాడో? నాది, నేను అహంకారములూ, దానాల పేరుతో ధర్మాల పేరుతో వాగ సత్యం పేరుతో ఆర్జించనివారి అధిక ఆస్తి రక్షణకై ఏర్పాట్లు కాబడిన వ్యవస్థ నుండి పరిణితి చెందిన రాజ్యాంగములే ఈనాటి మానవునకు ప్రబల శతృవులు. కనుక ఆది మృగమునకు ఆహార ఆత్మ రక్షణలు ఎంత ప్రధానములో నేటి నాగరిక మానవునకు అంతే అవసరము. కనుక కళలు సారస్వతము ఈనాటి మానవుల అవసరాలను తీర్చుకొనేందుకు సుఖించేందుకు ఏమార్గమవలంబించాలో ఎవరినుండి ఆరూపంలో ఆత్మరక్షణ చేసుకోవాలో ప్రతిబింబించాలి. అప్పుడే కళలు సారస్వతం ప్రజాదరణతో తమ నిజస్వరూపాన్ని పొంది వికసింపగలవు.

# జయోస్తుతే

**- శ్రీ మాధవరామశర్మ -**

పూర్వరంగ ప్రభావేణ రంగా పూర్వవిధాయినే
విధాన సంవిధానోత్థ తేజోగాధస చేతసే
చేతోదీప్తి సముల్లాస సముపోధ జనాత్మనే
ఆత్మనీన కథాసంగ స్నిగ్ధసుస్నిగ్ధ సంవిదే
సంవిదానంద సౌభాగ్య పరాభూతి ప్రకాశినే
కాశమాన కథాగోష్ఠీ పూర్వరంగ ప్రభావినే
నాజరా యజగాక్లాంతి నిస్త్రిగ్ధాయ జయోఽస్తుతే
స్తుతే సకల కళ్యాణ వైభవాశ్రయ వైభవే

# ప్రశంస

- నేదునూరి గంగాధరం -

ఆంధ్రదేశములో ననన్యసామాన్యమౌ
కీర్తినార్జించిన మూర్తి యెవడు
శ్రీ నాజరను పేర జెన్నారు ధరణిపై
బుఱ్ఱకథా చతుర్ముఖు డెవండు
సహజగాంభీర్యపు సంగీత సాహితిన్
వీరకథలను జెప్పు ధీరు డెవడు
శక్తిమీరగ భక్తిరక్తి రసముజూపి
తంబురా మీటెడు ధన్యుడెవడు

అట్టిపూజ్యుడు గాన కళావతంసు
డైన నాజరునకును సన్మానమనగ
తెలుగుతల్లికి మనభక్తి తెలుపుకొనుట
భీమవరపౌరులార ప్రవీణులార !

నారదతుంబురుల్ హరి ననారతము న్భజియించి తంబురన్
గోరున మీటుచున్ విబుధకోటులు మెచ్చగ బాడినారు నీ
వారయ సర్వమానవు లవశ్యము వశ్యముగాగ మాధురీ
ధారలు హృద్గతంబునను దండిగనింపితి వయ్య నాజరా !

చలనచిత్రము లందున మెలగు కతన
మేటినటుడని విఖ్యాతి జాటినావు
రమ్య కృతులను రచియించి రాణకెక్క
బుఱ్ఱకథలందు నీసాటి బుఱ్ఱగలదె ?

గన్నాబత్తుల సుబ్బరావుయిలనిన్ గన్నాభిషేకంబుతో
ఎన్నన్ బంగరు గండపెండెరముతో నీరీతి సన్మానమున్
జెన్నారన్ గయిసేయనెంచె విబుధ శ్రేణీమణుల్ మెచ్చగన్
అన్నాదాల్చుము వీరలాంఛనముగా నాజర్ మహానీయుడా

గన్నాబత్తుల వంశమూర్తు లిపుడీకార్యాను సంధానులై
యున్నన్ భీమవర ప్రముఖ్యవరులున్ యుర్వీతలన్ యాగగన్
అన్నానీకొక గొప్పకాన్కయిడినా రయ్యా నాజరయ్యా భువిన్
యెన్నంగావలె నిట్టి దానగుణులన్ యీరేడులోకంబులన్
శ్రీశ్రీ వరదుండు మిమ్మున్
శ్రీశ్రీ లిడి బ్రోచుగాక స్థిరతరకూర్మిన్
శ్రీశ్రీల నంది మీరలు
శ్రీశ్రీ లకు పాటుపడుడు శ్రితగుణులారా!

# కళారాధకుడు

కొల్లా వెంకటేశ్వరరావు

సామాన్య కుటుంబములో పుట్టి కాయకష్టం చేసికొంటూ స్వాతంత్ర్య పోరాటంలో దూకి బుర్రకథలద్వారా తెలుగు బిడ్డలకు చైతన్యం గలిగించి బుర్రకథాపితామహులుగా ప్రఖ్యాతిగాంచిన "గానకళావిశారదు" లగు శ్రీ నాజరు గారిని సన్మానించుట ముదావహం.

కళలను నిర్లక్ష్యంచేస్తే జాతికి జాగృతి గల్గుట కష్టం. వానిని పోషించ టానికి ఈరోజున రాజులు, గా రాజులు లే

ఆ బాధ్యతను స్వీకరించి జాతికి నీతికి జనము జీవము పోయు జానపద కళల పునరుద్ధరణకు ముందుకు రావలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

కళారాధకులను గౌరవించిననాడే దేశం పురోభివృద్ధి గాంచగలదన్న సత్యాన్ని గుర్తించి శ్రీ నాజరును ఘనంగా సన్మానించిన ఈ ఆహ్వాన సంఘం వారికి నా అభినందనములు.

# తంబురకథలో హాస్యం - దాని విశిష్టత

- సలాది భాస్కరరావు -



రచయిత

ఆంధ్ర దేశంలో తంబురకథ బుర్రకథగా ప్రజలకు సుపరిచితమై ప్రియతమ కళారూపంగా నేటికి ఆదరించబడుతున్నది. ప్రాచీన సాంప్రదాయం ఈ కళా రూపమునకు ఉండబట్టే దీని ప్రతిభ శతాబ్దాలు దాటినా జవ సత్వంతో ప్రజలమధ్య ఈ నాటికి నిలువగలిగింది. కాని ఈ నాడు చెబుతున్న బుర్రకథలు వాటి తెన్నులు పరికిస్తే తత్సాంప్రదాయపు లక్షణాలు క్షీణించి అనాదిగా ఆంధ్రావనిలో దానికున్న సమగ్ర స్వరూపం మారిపోయి వికృత రూపం ధరించటం జరుగుతోంది. అందుకు బుర్రకథ గాయకులు పరిశీలనా దృక్పథంతో వాస్తవిక పరిస్థితులు గమనించితే ప్రజల కళారూపంగా బుర్రకథను తిరిగి సజీవ రూపంతో తీర్చి దిద్దుకోవచ్చు.

## యక్షగానము - బుర్రకథ

యక్షగాన రూపంనుండి వివిధ దశలలో మార్పు చెందుతూ పెంపొందిన కళారూపమే బుర్రకథ. యక్షగానంలో విదూషకుడుగా, కోణంగిగా ప్రత్యేకమైన పాత్రలు సజీవములు. విదూషకుడనగా తెల్పుకొనుట. తెలియ చేయుట. తెలుపుట కోణంగి పాత్రకూడా విషయ వివరణను మరంత స్పష్టీకరించిన పాత్రయే కాని, [illegible] కోవకు చెందినది మాత్రము కాదు. ఈ పాత్రల చిత్రణను గ్రహించగా, ప్రబోధాత్మకమైన ఇతి వృత్తం కలిగి జీవిత ఔన్నత్యమును గ్రహించే విధంగా ఉత్తేజపరిచి ఉత్సాహము కలుగ చేసి మును ముందుకు కదిలించేందుకు పరిపుష్ట రూపమే విదూషక కోణంగి పాత్రలు. అవి అత్యంత్య గణనీయమైనవి అతి ప్రధానమైనవి.

## తెల్పుకోవల్సినది తెలియచేయునది ఏమి?

### అర్థము — కామము

మానవుడు తానుగా బ్రతుకుటకు కావల్సిన సాధన సంపత్తిని సమకూర్చుకొని బ్రతికేందు కుపకరించేదే అర్థము.

తానుగా భుజించిన అన్న పానాదుల వలన ఏర్పడిన పంచేంద్రియములు కలయిక చే సృష్టింపబడినదే కామం. అర్థముద్వారా జీవిత ఉపకరణకు కావలసిన విషయ వివరణయున్నా, నైతిక విలువలను పెంచి పోషించి మానవతా విలువలను కాపాడేందుకు తగిన స్తోమతను కలిగించేందుకు అర్థ, కామములు విడదీయరాని జంటలు కావున, అర్థ కామముల బాటలు చెప్పితే బ్రతుకే అంధకారమవుతుంది. యుగయుగాల సత్సాంప్రదాయపు విలువలను తెలియ చేయుటయే విదూషక, కోణంగి పాత్రల విధ్యుక్త ధర్మము. అందు

కొరకే పాత్రలు ప్రవేశపెట్టబడినవి. వీధినాటకంగా, బొమ్మలాటగా, హరికథగా, బుర్రకథగా మార్పు చెందుతూ వచ్చిన యక్షగాన కళాఖండలో మరింత ప్రస్ఫుటంగా హాస్యపాత్ర కనుపిస్తోంది. ఇతివృత్తిలో హాస్యం లేదుకదా?.

కథా సంవిధానంలో హాస్యరస పోషణకు అనువుగా ఈ నాటి బుర్రకథా రచనలు లేవు. అయితే కథపరిపుష్టికి నవరసాలతో పాటు హాస్యరసమును కథలో చొప్పించటం జరుగుతోంది. అయినప్పుడు హాస్యరసం ప్రదర్శనా యోగ్యతకు తగినవిధంగా పరిణామం చెందుట అవసరం కదా! అందుకుగాను రచనలోను, కళారూపంలోనూ సజీవంగా హాస్యరస పోషణ పెంపొందటం కాదన లేరుగదా? అందువలన బుర్రకథ కళాకారులు రచయితలు ఈ విషయం సహృదయంతో పరిశీలించాలి.

## హాస్యనటుడు ఎలావుండాలి?

శ్లో॥ "రూపావాన్ మధురాభాషి"
నందీశ్వర ప్రోక్తం)

చక్కని రూపము, శ్రావ్యమైన గాత్రము, మధుర వాక్కులచే తీరుతెన్నులు కలిగి నటువంటి అవయవ సౌష్టవము కళాకారునకు విధిగా వుండితీరాలని భరతుడు, నందీశ్వరుడు మొదలగు శాస్త్రకారులు నుడివిరి. ప్రదర్శనలో చొప్పించిన పాత్రలను వొప్పించుటకుగాను తగిన శక్తిసామర్థ్యములు కలిగి కవ్వించి నవ్వించే హాస్యం అందించాలిగాని, పాత్రలరూపం తరముల తరతమ భేదాలతో నిమిత్తం లేకుండా కన్ను మెల్లగానో పన్ను గొగ్గిగానో, మూతి వంకరగానో, నడక కుంటిగానో వుండి హాస్యాన్ని అందించేందుకు నటుడుగా రంగస్థలంపై కనుపించటం 'హాస్యరసాన్ని, హాస్య భావాన్ని హాస్య పాత్రను సజీవంగా చిత్రించుకోలేని అసమగ్రమైన విధానమే కాక అస్వాభావికమని చెప్పుటలో ప్రాజ్ఞులెవరు సందేహించరు.

## హాస్యపాత్ర అందించేది- అందుకొనేది

సమాజంలోవున్న కుళ్ళును యథా విధంగా చిత్రణ గావించి అరాచకాన్ని, అక్రమాన్ని. అన్యాయాన్ని, నిష్కర్షగా నిర్మొహమాటంగా ఎదుర్కొని మానవతా విలువలను పెంచి ప్రకృతి శక్తులు మానవుని అదుపాజ్ఞలలో పెరిగి పెద్దవయ్యేందుకు, విశ్వ మానవ కళ్యాణం నిత్యం వర్ధిల్లేందుకు బాటలు చూపుటయే హాస్యరసముగాని. మతాలనో, ప్రభుత్వాలనో, అధికార, అనధికార రాజకీయ పక్షాలకు అంటిపెట్టుకొని, కూపస్థ మండూకమువలె బాహ్య ప్రపంచమును, వెకిలిగా ఎక్కిరించుటకు హాస్య రసమును పోషింపచేయుట సహేతుకమని భావించటం సమంజసమా?

## కర్తవ్యమునకు ఉపకరించేదే హాస్యము

నిత్య నూతన పోకడలతో పరిణామం చెందుతున్న సమాజం వడుదుడుకులు లేకుండా ముందడుగు వేసేందుకు అందుకు తగిన బాటలు చూపేందుకు, నాడు, నేడు అనేది వివరంగా తెలియచేసి, పుష్టి, తుష్టి కలిగి వృద్ధిచెందే విధంగా విషయ పరిజ్ఞానాన్ని అందించి, పాత కొత్త కలయికలతో నిత్యనూతనత్వాన్ని సృష్టించుటకు హాస్యరసమునకు పరమావధి. ఈ మహత్తర పవిత్ర కర్తవ్యమే నేటి హాస్యకళాకారుల విధ్యుక్త ధర్మం?

# ఆవాహన



సానికొమ్ము కృష్ణారెడ్డి

ప్రణుతి చేయరా
గుండెతలుపు తీయరా-
పూలమాల వేయరా
పరిమళాలు పూయరా

నాజరు తెలుగింటి వెలుగురేడు
జానపద
కళాకారులకే ఎకిమీడు

పీడిత నరజాతి హృదులు
ప్రిదిలి రుధిర ఝరులు జార
రుద్ర భద్ర ముద్ర దాల్చి
నిద్రిత జనతను కదల్చ

విప్లవ కంఠమ్ము నెత్తెరా
తిరుగుబాటు
ఎడదల్లో విదపెట్టెరా

సంఘటితశక్తి భువికి
సాధించే ప్రగతిజూపి
మహోజ్వల భావిలోకి
దాని తెరచి; ధనాంధముగ

మారణహోమం జేసెరా
చేతనలకు
ఆయువిడిన కళాబ్రహ్మరా

బడుగునరుని "జీవనాడి-
గుడి"లో వెలిగించి త్రాణ
మళ్ళీ మన జానపదుల
కళాగళమున ప్రాణం

గుమ్మరించి గుండెలూపెరా
బండరాల
కరిగించే మధురగానరా

"మడిసి"కి తావిడు నాతని
కవిత మానవతానీతం
పేదజనుల ప్రతినిధిగా
పాడెదు మహతీగీతం

నిగళాలను విరిచివేయుగా
మానవ క
ళ్యాణానికి పాగాణిత్రేయుగా

# బుర్రకథలో నా అనుభవాలు ★

**- చిన్న బ్బాయి**

1953 సంవత్సరంలో గుంటూరు తాలూకా పొన్నెకల్లు గ్రామంలో సామాన్య ముస్లిం కుటుంబంలో పుట్టి పెరిగాను. ఆర్థిక స్తిమితం లేని కుటుంబం కావటంవల్ల కాయకష్టము చేసికొని జీవిస్తుండేది మా కుటుంబం. తాతల కాలంనుండి అనువంశీయంగా ఆస్తిపాస్తులకన్న కాస్తోకూస్తో మాయింట సంగీతాన్ని మటుకు ఆదరించి ఆరాధించటం వల్లనే గాయకుడుగా బుర్రకథలో గానం చేయుటకు నాకీ అవకాశం లభించింది.

ఆంధ్ర దేశములో ఆబాల గోపాలనికి సుపరిచితులై బుర్రకథలద్వారా లక్షలాది ప్రజానీకాన్ని ఉర్రూతలూగించిన పూజ్యులగు శ్రీయుత నాజరుగారు మా కుటుంబానికి సన్నిహితులు కావటంవల్ల నా పరిస్థితులను గమనించి నాకు తగిన అవకాశాన్ని కల్పించుటచేత బుర్రకథా కళారంగంలో నేనొక సభ్యుడనైతిని. సాహితీ కళాకారుల పరిచయం నాకు అబ్బింది. అంతేకాదు ప్రాచీన సంప్రదాయ కళా రూపాలను అవగతం చేసికొని అనేకమైన విషయాలను తేట తెల్లంచేసే నాజరుగారి సహచర్యంవల్ల ప్రజల కళా రూపమైన బుర్రకథ కళా రూపాన్ని గురించి నాకు కలిగిన అభిప్రాయాలను మీ ముందుంచుటకు మన్నించ గలరను విశ్వాసముతోను సాటి నాబోటి కళాకారులకు నా అనుభవాలను తెలియ జేసేందుకు అవకాశము కల్పించిన శ్రీయుత నాజరు సన్మానోత్సవ సంచిక వారికి నా అభివందనములు.

బుర్రకథ జంగంకథ తందాన పాట అనే పేరుతో ఈ నాటికి ఒక రూపంలో లేకపోయినా ప్రజలు ఆదరించి అభిమానించి పోషించిన కళా రూపంగా గుర్తించటంలో ఎవరికి ఏ విధమైన అభిప్రాయ భేదము లేదు. కాని బుర్రకథ కళా రూపానికి పూర్తిగా రూపురేఖలు తీర్చి దిద్దుకొనుటలో మాత్రం ఒక సమగ్రమైన పద్ధతి కనుపించటం లేదు. ఇందుకు తగిన ప్రోత్సాహం సహకారం ప్రజలనుండి లభిస్తుందా లేదా అన్న సమస్య గాదు. ఆదరాభిమానాలు ఈ కళా ఖండానికి లేవని కాదు. బుర్రకథకు ఒక సంప్రదాయము ఒక నియమము



రచయిత

తత్ సంబంధమైన సాహిత్యము అందుకు తగిన సంగీతము ఉన్నదని బుర్రకథ కళా రూపాన్ని ఆరాధిస్తున్న మిత్రులకు తెలియక పోవటం వల్లనే ఈ కళా రూపాన్ని ఒకే విధంగా చూడలేక పోతున్నాం. అందుకు కారణం బుర్రకథ కళాకారులకు ఈ కళా రూపాన్ని సత్సంప్రదాయ పద్ధతులకు అనుగుణంగా మల్చుకోగల దూరదృష్టితో తగిన విధంగా కృషి చేయటంలేదని మాత్రం సుస్పష్టం. అయితే ఈ నాడు కొంతమంది బుర్రకథా కళా రూపముయొక్క సమగ్ర స్వరూపం చూడాలనియు చూపించాలనియు అందుకై తగిన కృషి చేయాలని కాంక్షమాత్ర మున్నది. ఆంధ్ర దేశంలో బుర్రకథ గాయకులు గాను వంతలు గా కృషి చేస్తున్నవారు బహు కొద్దిమందే ఉన్నారనేది నిర్వివాదమైన విషయం.

ముగ్గురు సభ్యులతోనే బుర్రకథ గానం చేయాలా? హార్మోనియం, తపల డప్పులు డోలకులు ఉపయోగించవచ్చునా? ఈ సమస్యలు ఈ రంగతో పనిచేస్తున్న కళాకారులకు తక్షణ సమస్యలు. బుర్రకథకు ఔచిత్యానికి భంగంలేని విధంగా వినూత్న సంప్రదాయాలను బుర్రకథ కళా రూపములో చొప్పించటం జరిగితే ఎంతైన సంతోషం.

విభిన్న దృక్పథాలతో తీరుతెన్నుల లేకుండా బుర్రకథలు చెప్పటం ఈ నాడు - ఎవరూ - ఎరుగని విష

యం కాదు. అయితే ఇందుకు తగిన కారణం లేకపోలేదు. ప్రాచీన యక్షగానం నుండి రూపాంతరం కలిగి బుర్రకథ కళాఖండగా పరిణామం చెందిన విషయములు తెలిపే సమగ్ర గ్రంథములు లేక పోవటం, శిక్షణకు గాను విద్యాలయాలు లేక పోవటం, సంగీత శిక్షణ పొందక పోవటం, జానపద సంగీత పణతులు తెలియక పోవటం, తగినవిద్య లేక పోవటం, అందుకు తగిన ప్రోత్సాహం సహకారం సులభంగా లభ్యంకాక పోవటం చేతను అనుకరణతో ఈ కళను అభ్యశించటం వల్లను సరియైన శిల్పము సక్రమమైన రూపంతో బుర్రకథ కళ పెంపొందటం లేదని నా అనుభవంలో తెలుసుకొన్నాను. అకాడమీలు సంగీత నృత్య సాహిత్య లలితకళల ప్రాభవంకై రాష్ట్ర స్థాయిలోను అఖిల భారతంగాను స్థాపించబడినవి. వివిధ కళల వికాసానికి ఔన్నత్యానికి సంబంధించిన పరిశోధకులను నియమించే పద్ధతులలో మాత్రం ఆయా కళాకారులను నియమించక పోవటం గమనార్హం. అకాడమీల కృషి వివిధ కళా రంగాల ఔన్నత్యం ఇనుమడింప జేయుటలో ప్రతి కళాకారుడు తగిన సహకారం అందజేసి దేశీయ కళోద్యమంలో ప్రతి కళాకారుడు కర్తవ్య సాధనకు ముందడుగు వేస్తే చేస్తున్న కృషికి ప్రజాదరణ తప్పక లభిస్తుంది. ప్రజల కళా రూపమైన బుర్రకథకు సరియైన రూపం లభిస్తుంది.

# కళాతపస్వి నాజర్

మురారి

మరుగుబడ్డ తెలుగుకళల
మళ్ళీ రూపం దిద్దుక
జనులను ఉర్రూతలూపి
జయభేరిన మ్రోగించావ్

ఆంధ్రప్రజకు నీపైగల
అభిమానం ఏమందును
నాజరు బుర్రకథంటే
ప్రజలు పొంగిపోతారోయ్

జానపదాలకు మళ్ళీ
జీవం నీవే పోసీ
తెలుగుజాతి ప్రత్యేకత
కలదని చూపెట్టినావు

యావదాంధ్ర జనులనెల్ల
యక్షగానాలతోటి
ముగ్ధుల గావించిన, సా
మర్థ్యం నీదేనోయ్

పామరుని వద్దనుండి
పండిత ప్రకాండు వరకు
ఆంధ్రభూమి నలుమూలల
ఆహా! యనిపించినావు

అమరకళా తపస్వీ
ఆంధ్రమాత యశస్వీ
అభినందన లివే నీకు
అందుకొమ్ము ఓ నాజర్!

# 'బుర్రకథ' కళాస్వరూపం

శ్రీ శ్రీనివాసచక్రవర్తి

14వ శతాబ్దంలో వినుకొండ వల్లభరాయడో, శ్రీనాథుడో రచించిన క్రీడాభిరామంలో—

"కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమ ధ్వనితోగ
　　　కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టు బొమ్మల నసలుకొల్పిన కన్ను
　　　నొడుపుగా దాటించు నెడప దడప
శ్రుతికి మత్కుర్ణంబు జానంగవలయుచో
　　　జెవిత్రాడు బిగియించు జీవగర్ర
గిలుకుగిలుకున మ్రోయు కింకిణీగుచ్ఛంబు
　　　తాళమానంబుతో మేళవింప

రాగమున నుండి లంఘించి రాగమునకు
నురుము నూరుద్వయంబుపై నొత్తిగిల్ల
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు బాడుచు వచ్చె జక్కులపురంధ్రి"

అనిన్నీ పాల్కురికి సోమనాథుడు (12వ శతాబ్దం) పండితారాధ్య చరిత్రలో—

"నాదట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాడెడు వాడెడువారు"

అనిన్నీ వర్ణించటాన్నిబట్టి నటి యక్షిణి లాగా అంటే నాట్యానికి అనువైన దుస్తులు ధరించి తంబురలాంటి జంత్రం వాయిస్తూ పాడుతూ ఆడుతూ కథ వినిపించేదని తెలుస్తుంది. యిలా కథ వినిపించే నటి జక్కుల పురంధ్రి జక్కు శబ్దానికి సంస్కృతం యక్షశబ్దం. జక్కులపాటకు సంస్కృతమే యక్షగానం. అంటే మూల యక్షగానం సంగీత నృత్య సహాయంతో కథ వినిపించే కళారూపమని స్పష్టమవుతుంది. ధర్మాంగద చరిత్ర, చిత్రాంగద విలాసం మొదలైన యక్షగానాలు "వేషము లగ్గట్టి జనులు పాడి వినిపింప" రచించినవి. అతి ప్రాచీన యక్షగానాలుగా పరిగణితమవుతున్న ఓబయమంత్రి గరుడాచలం, కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయం పరికిస్తే ఈ విషయం ఇంకా స్పష్టమవుతుంది. ఇవి పాడి వినిపించేవేగాని నాటకంలాగ ప్రదర్శించేవి కావు. ఒకే నటి వివిధపాత్రలను అభినయించేది.

ఆ తరువాత సూత్రకారుడు ప్రవేశించాడు. ఈ సూత్రధారుడు కథాసంధి చెపుతూ పాటకు హంగు చేస్తూ చిల్లరపాత్రల వాచకం చెబుతుండేవాడు. నటి వివిధ ప్రధానపాత్రలను అభినయిస్తూ కథ వినిపించేది. ఇలాంటి కళారూపమే భామాకలాపం. తర్వాత యక్షగానం ఉంకోదశ నందుకొంది ఒకేనటి వివిధ పాత్రలను అభినయించటమే కాకుండా ఒక్కొక్క పాత్రను ఒక్కొక్కరు అభినయించే సంప్రదాయం ఏర్పడింది. యాదవదాసు గరుడాచలంలో తంజావూరు యక్షగానాల్లో పాత్రల ప్రవేశం పొందుపరిచాడు. ప్రతి వేషం తన పేరు ఊరూ తెల్పుతూ "వెడలె........" అంటూ ప్రవేశిస్తుంది. ఈ దశలోని యక్షగానాలను యక్షగాన నాటకాలని వీధినాటకాలని పిలుస్తున్నాం.

ఒక్కొక్క పాత్రను ఒక్కొక్కరు ధరించే విధానంతో యక్షగానాలు ఆడుతూన్నా మూల యక్షగాన రూపం నశించలేదు. రూపాంతరం పొంది బుర్రకథగా, హరికథగా పరిణామం చెందింది. హరికథ పితామహ నారాయణదాసు గారు తమ హరికథలకు యక్షగానాలనే పేరు బెట్టారు.

బుర్రకథనే జంగం కథని తందానపాటని సామాన్యంగా పిలుస్తుంటారు. మూల యక్షగానంలో కథ వినిపించేది యెక్కువగా జక్కులవారలయితే బుర్రకథ వినిపించేది జంగాలు. మూల యక్షగానంలో స్త్రీ కథ వినిపించేది. బుర్రకథలో పురుషుడు తగిన దుస్తులు ధరించి కథ వినిపిస్తాడు. యక్షగానంలోని సూత్రధారుడు బదులు బుర్రకథలో వంతలు ప్రవేశించారు. ఈవంతలు కథకునితో వంతపాడుతూ మధ్యమధ్య హాస్యం చెబుతుండేవాడు. పూర్వం స్త్రీలే వంతలుగా వ్యవహరించేవారు. ఇపుడు పురుషులు నిర్వహించుచున్నారు. అయితే యిపుడు స్త్రీలు కథ చెప్పడం వంత పాడడం

కూడా కద్దు. నేటి ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజా జీవితం రాజకీయాలలో పెనవేసుకొని యుండటంవలన వంతలలో ఒకరు రాజకీయాలు చెబుతున్నారు. మూల యక్షగానంలో లాగానే వంతలు వేషాలు ధరిస్తున్నారు. మొత్తంమీద పరికిస్తే మూల యక్షగానం రూపాంతరంచెంది బుర్రకథగా పరిణమించిందని స్పష్టమవుతుంది. కథకుడు వాయించే తాంబూరాబుర్రను బట్టి దీనికి బుర్రకథ అనే పేరు వచ్చిందని ఊహించవచ్చు. క్రీడాభిరామ రచనా కాలానికే బుర్రకథ కళారూపం బహుళ ప్రచారంలో వుందని అందులోని-

"ద్రుతతాళంబున నీగుంభిత కధుం
దుందుం కిటాత్కారి సం
గతి వాయింపుచు నాంతరాళిక యతి
గ్రీనాభిరామంబు గా
యతి గూడం ద్విపద ప్రబంధమున వీ
రానీకముం బాడెనో
కృత ప్రత్యక్షరముం గుమారకులు ఫీ
ట్కారంబునం దూలగన్"

అనే పద్యమువలన తెలుస్తున్నది. యిందులోని గుంభియే గుమ్మెట లేక డక్కీ అని పండితుల అభిప్రాయము.

## యితివృత్తం

మూల యక్షగానాలలోని యితివృత్తం పౌరాణికం. యక్షగానం బుర్రకథగా పరిణమించిన తర్వాత చారిత్రిక, జానపద గాథలు, పతివ్రతా మహాత్మ్యాలు యితివృత్తాలయినవి పల్నాటిచరిత్ర, బొబ్బిలియుద్ధం, చారిత్రాత్మకాలు, బాలనాగమ్మకథ మొదలయినవి పతివ్రతా మహాత్మ్యానికి సంబంధించిన యితివృత్తాలు అయితే పౌరాణిక కథలు యితివృత్తాలుగా బుర్రకథలు లేకపోలేదు. ఉత్తర గోగ్రహణం మొదలయినవి పౌరాణికాలే. గత యిరవై సంవత్సరాలలో యితర కళారూపాల యితివృత్తాలలో లాగానే బుర్రకథ యితివృత్తాలలో కూడా పెద్దమార్పువచ్చింది. ప్రజా సమస్యలను ప్రజానాయకుల జీవితాలను యితివృత్తాలుగా చేసుకొని బుర్రకథలు వ్రాయటం ప్రారంభించారు. శ్రీ సుంకర సత్యనారాయణ కష్టజీవి వీరేశలింగం బుర్రకథలు శ్రీ నాజర్ రాయలసీమ బుర్రకథ యిలాంటివే.

## భాష

బుర్రకథ దేశికళారూపం. పండితుల దగ్గరనుంచి పామరులవరకు అందరినీ ఆనందింపచేయటం చైతన్యవంతులను చేయటం పరమోద్దేశం. అందుచేతనే అనాదినుంచి నేటివరకు వ్యవహారికభాషలో వీటిని రచించటం పరిపాటయింది. వీటిలో తెలుగునుడికారం తొణికిసలాడుతూ ఉంటుంది. అందువల్లనే బుర్రకథ సకల జనులను పులకరింపచేస్తుంది.

## ఛందస్సు

మూలయక్షగానాల్లో త్రిపుటలు జంపెలు ఏలలు మొదలయిన దేశీయచ్ఛందస్సులనే ఉపయోగించారు. యక్షగానం బుర్రకథగా అవతరించిన తర్వాత మంజరీ ద్విపదను ఎక్కువగా వాడసాగారు. శ్రీనాధుడు పల్నాటియుద్ధం మంజరీద్విపదలో రచించిందే. ఈ శతాబ్దంలో ధేనువుకొండ వెంకయామాత్యుడు ద్విపదనే కాక కందార్థాలు కీర్తనలు దరువులు ప్రవేశపెట్టారు. నాటినుంచి ఆబాణీలోనే బుర్రకథలు రచిస్తున్నారు. నేటిబుర్రకథలలో "వినరాభారతవీరకుమారా" లాంటి సుకటాలు ప్రవేశపెటుతున్నారు. పైపై నృత్యాలు తందనలు ఎక్కువగా చొప్పిస్తున్నారు.

## సంగీతం, నృత్యం

అయితే మూలయక్షగానంలో బుర్రకథలో సంగీతం ఎలాంటిది; ఏబాణీకిచెందింది అనేదే ప్రశ్న. మూలయక్షగానం బుర్రకథ జానపద కళారూపాలే. అందువల్ల వీటిలోని సంగీతం దేశీసంగీతం. శ్రీనాధుడు భీమఖండంలో "కీర్తింతురెద్దాని కీర్తిగంధర్వులు గాంధర్వమున యక్షగానసరణి" అనటాన్నిబట్టిన్ని గోవింద దీక్షితుని సంగీతసుధఅనే లక్షణగ్రంధంలో యక్షగానం యక్షులచే పాడబడే సంగీత విశేషంఅనే ఉండటం బట్టిన్ని యక్షగానం తొలుత ఒక దేశిబాణీకి పేరైవుంటుందని తోస్తుంది. యీ బాణీలోనే పూర్వం యక్షగానాన్ని తర్వాత బుర్రకథనూ పాడేవారని ఊహించవచ్చు ఈ యక్షగాన బాణీ సంగీతరూపాన్ని లక్షణాన్ని సంగీత పండితులు పరిశోధించి తేల్చవలసినది. అలాగే బుర్రకథలోని నృత్యంకూడా దేశీయమయిందే భరతాదులు ఈ దేశీయనృత్యాలను ఉదహరించియున్నారు.

## రసం

జానపద కళారూపమైన బుర్రకథలో వీరకరుణా రసాలకే ప్రాధాన్యం హెచ్చు. ఆ తర్వాత బీభత్స భయానకరసాలు. శృంగారానికి ప్రాధాన్యం తక్కువ.

యావత్ భారతదేశంలో ఒకఅపూర్వకళారూపంగా విలసిల్లుతున్న బుర్రకథ కళారూపం తొలి యక్షగాన రూపాంతరం అనటంలో సందేహం లేదు.

# ఆలిండియా రేడియో!
# అఖిలాంధ్ర సంగీత సాహిత్య నాటక ఎకాడమీ

- శ్రీ పి. వి. సుబ్బారావు -

రేడియో కేంద్రమంటె మానవ నాగరికతా చిహ్నమని అనటంలో ఎవరు సందేహించరు. రేడియో ప్రయోజనం సాంకేతిక విజ్ఞానంతోపాటు సత్సాంప్రదాయ విధానాలకు ఆలవాలమై సాహిత్యం సంగీతం ఒకటేమిటి ఒక్కమాటలో చెప్పాలంటె మానవ విజ్ఞాన సర్వస్వాన్ని విశదీకరించే ప్రచారసాధనం.

## సంగీతం - రేడియో

సాహిత్య సంగీత నృత్యములు జాతి సంస్కృతికి పునాదులనే విషయం వాదోపవాదాలకు తావులేని యథార్థ సత్యం. అయితే ప్రజల నిత్యజీవిత చిత్రణకు ఉపాంగాలైన కళలు ఈనాడు ఏ దశలో యున్నవో రేడియో నిర్వాహకులకు తెలియదని, అందుకు తగిన కృషి చేయటంలేదని విమర్శనకన్నా విషయ వివరణకై తీసుకొన్న చర్యలో లోపంవుందని మాత్రం చెప్పవచ్చు. ఎందుకనగా ఆలిండియా రేడియో నిర్వాహకులగు బాలాంత్రపు రజనీకాంతరావుగారు వారు వ్రాసుకొన్న సంగీత వాగ్గేయకారుల గ్రంథంలో కర్నాటక సంగీతాన్ని ప్రజలు వినటంలేదని వ్రాసుకొన్నారు.

## కర్నాటక సంగీతం

కర్నాటక సంగీతమంటె 1668 సం|| రంలో శ్రీ పురందరవిఠల్ దాసుగారు సంగీతానికి శిలబస్ సృష్టించారు. అందుకు వారిని కర్నాట సంగీత పితామహుడనియు, కర్నాటకప్రాంతము వారైనందున వారిచే సంస్కరింపబడిన ఈ సంగీతమునకు కర్నాటక సంగీతమనియు పేరు పెట్టటం జరిగింది. మరొక్క విషయం కూడా మీముందుంచుతున్నాను. కర్న అనగా చెవియనియు ఆట అనగా వినోదమనియు అనగా కర్నానంద మగునది కర్నాటక సంగీతమనియు తెలుపుచున్నది కదా ? ఒక ప్రాంతీయ సంకుచిత విధానానికి అనువుగా వాదించటం కన్న ఈ సంగీతం ప్రజల అభిరుచికి దూరమయిందనేదియు ప్రయోజనశూన్యమైనదనియు తెలుసుకోవటం మంచిది.

## ప్రజల ప్రాచీన కళారూపాలు

కురవంజి యక్షగాన సుసాంప్రదాయ సగళిని పుణికిపుచ్చుకొన్న దేశీయ కళారూపాలు తోలుబొమ్మలాటలు చెక్కబొమ్మలాటలు ఒగ్గులకథ, తందానకథ. బయనీలకథ, పంబలకథ, జముకులకథ మొదలగు జానపద కళారూపాలకు తెలంగుగడ్డ పోతుగడ్డ. ఈ దేశీయ కళారూపాలకు సాహిత్యం, సంగీతం, సుశిక్షితమైన సాంప్రదాయం ఒకటి ఉందనేది స్పష్టమైన విషయం, ఈ కళారూపాల పునర్వికాసముకై జరుగుచున్న కృషిలో రేడియో వారు నిర్వహించు కళారూపాల తీరును కొన్ని మచ్చుకు చూపుతాను.

## రేడియో ప్రదర్శనల తీరుతెన్నులు

కరీంనగరు జిల్లాలో ఈనాటి ప్రజల ఆదరాభిమానాలతో విలసిల్లుతున్న ఒగ్గులకథ మధ్యాహ్నం పూట మండుటెండలో చెప్పు సాంప్రదాయం ఈనాటికి ఉంది. వేలాది ప్రజలు ఆ కళను ఆదరిస్తున్నారు. ఒగ్గులకథను రేడియోవారు నిర్వహించిన తీరును గమనిస్తే సాంప్రదాయ కళారూపానికి చెంపపెట్టుగా ఉంది. సంగీతంకాని, సాహిత్యంకాని సాంప్రదాయ సిద్ధముగా లేవు. సాహిత్యం ప్రణాళికాబద్ధంగా ఉంది. ఒగ్గులకథకు ఉపయోగించే వాయిద్యాలనైనా నియమబద్ధంగా వినిపించటం జరగలేదు — బుర్రకథల నిర్వహణలో ఒక నియమం పాటిస్తున్నారేమోనని భావిస్తాను. తందానతాన అనే వూతపదం ఉంటే బుర్రకథగా వినిపించటం సర్వసాధారణమయింది. జోలపాటలు, ఏలపదాలు, నివాళిపదాలు, జనపదాలు వినిపించే పద్ధతి చూస్తుంటే స్టేషన్ మార్చి సిలోన్ స్టేషన్ వెతుక్కునే దశ ఏర్పడింది.

## చేయుతగింది.

మారుమూలల మరుగుపడి వివిధ జానపద కళారూపాల కళాకారులు వృద్ధాప్యంతోను ఆర్థిక దుస్థితితోను అకాలమరణానికి ఆహుతై పోతున్నారు. వారిని ఆదరించి, ఆదుకోవటంకన్నా ముందు వారి వద్దనున్న ప్రాచీన కళారూపాల తీరుతెన్నులను తెలుసుకొని సమగ్ర రక్షణ కల్పించితే వివిధ దేశీయ కళారూపాల వాస్తవికత మనకు లభిస్తుంది - ఈ కార్యక్రమ నిర్వహణకు తీసుకోవల్సిన జాగ్రత్తలు ఒగ్గులకథ వివరణకు రంగస్థల నటకులను, జానపదగేయాల సేకరణకు ఎన్. జి. వోలను నృత్య నాట్యాల విషయ సేకరణకు పొలిటికల్ లీడర్సును నియమించక ప్రాచీన కళారూపాల నారాధిస్తున్న పెద్దలను పిన్నలను వారి వారి అనుభవ దశలను బట్టి నియమించి, జాతి జీవిత చిత్రణకు కళలకు ప్రజలకు గల సత్సంబంధాన్ని పెంపొందుకొనటం ఎంతైనా అవసరం. రేడియో నిర్వాహకులు ఈ కార్యక్రమం చేబట్టగలరనేది ఆశించవచ్చునా ?

## సాహిత్య సంగీత నాటక ఎకాడమి

సంగీత సాహిత్య నాటక ఎకాడమీల సంస్థాపన జరగటంతో నూతనశకం ప్రారంభమయిందని సంతోషించాం. గాయకులకు, నటకులకు, నాట్యకారులకు, కవులకు కల్పతరువు లాంటి సంస్థ జన్మించిందని గర్వించడం జరిగింది. నిజంగా ఆంధ్ర కళాకారులు గర్వించతగ్గ విషయమే. భామాకలాపం వంటి కళాప్రదర్శన లిచ్చిన ఉత్తమ కళాకారులు ఈ గడ్డపై పుట్టి పెరిగినవారే! ప్రాచ్యఖండాలకు సహితం శిల్ప కళాఔన్నత్యాన్ని తెలియచేసిన శిల్పకారులకు తెలుగుగడ్డ పుట్టినిగడ్డ. జానపద కళారూపాలకు తెలుగునేల పసందైన పూలతోట. పోతన, తిక్కన, శ్రీనాథులవంటి మహాకవులు జన్మించిన పుణ్యభూమిలో జాతి అభివృద్ధికి దోహదమిచ్చే సజీవగ్రంథాల కొరత ఒకవైపు. ఉత్తమ కళారూపాల వికృతరూపం మరొకవైపు. చరితను తెల్పే కళల కొరత మరొకవైపు ఎటుచూసిన సుస్పష్టమైన బాటలు కన్పడని అంధకారములో జాతి తన పురోభివృద్ధికి బాటలు తముదుకొంటున్నది. సంగీత సాహిత్య నాటక ఎకాడమి కంచుకాగడావలె కాక - విద్యుత్ కాంతులు వెదజల్లి భావి భారతజాతికి బాటలు చూపగలదని ఆశించవచ్చునా ?

భరతశాస్త్రం భారతీయులను సృష్టించలేదు. భరతుడు పుట్టకముందే భరతశాస్త్రం పుట్టింది అందుకు భరతుడే సాక్షి.

– నాజర్

"కడుపు ఆకలిని అన్నం తీరుస్తుంది
ఆత్మ ఆకలిని కళ తీరుస్తుంది"

– కొప్పరపు సుబ్బారావు

కళ కళకోసం కాదు. కళ ప్రచారం కోసం కాదు. కళ మానవ పరిణామ ప్రతిబింబం.

– నాజర్

# గండపెండేర బహూకరణ ప్రదాతలు

# గన్నాబత్తుల సహోదరులు



శ్రీ గన్నాబత్తుల నారాయణమూర్తి సుబ్బారావు అనే పెదతాత గార్లను గురించి పరిచయం చేయబోయే ముందు పండితులకు, పెద్దలకు, సాహిత్యాభిమానులకు ప్రముఖ కళాకారులకు కవిగాయకులకు ఒక చిన్న మనవి—

పశ్చిమ గోదావరి జిల్లాలో భీమవరంలో పుట్టి పెరిగిన శ్రీమంతులు బుల్లిస్వామి వెంకటరత్నమ్మ గార్లకు పుట్టిన సంతానమే గంగారావు నారాయణమూర్తి వెంకట్రామయ్య సుబ్బారావు అనే పెదతాత, గోవిందరాజులు అనే చినతాత గార్లు ప్రముఖ భూస్వాములు, సహృదయులు, దాతలు, కళాభిమానులు దానధర్మాలు చేయటంలో నేమి కవి గాయక కళాకారులను రప్పించి సహాయసంపత్తులు అందజేయుటలో నేమి పండిత విద్వత్ గోష్ఠులు జరిపించుటలో నేమి ప్రముఖ విద్వాంసులకు సన్మానాలు జరిపించుటలో నేమి ఈనాటికి భీమవరంలో జరుగు త్యాగరాజోత్సవాలు ఏర్పాట్లు చేయుటలో నేమి ఒకటేమిటి సత్కార్యాలు చేయటంతో ఎల్లప్పుడు వారి గృహాలు నిత్యకల్యాణం పచ్చ తోరణాలతో కళకళలాడుచూ పెళ్లిళ్ళలాగా వుంటాయి.

ప్రముఖ ఫిడేలు విద్వాంసులు, కీర్తిశేషులు ద్వారం నరసింగరావు నాయుడు గారు వీరి ఆదరాభిమానములతో ప్రసిద్ధి చెందినవారే. ఎల్లా సోమన్న, వి. కమలాకరరావు గార్లు మృదంగ విద్వాంసులుగా రాణించటానికి వీరి సహాయ సహకారాలే. అంతేకాదు విద్యాదానం అంటే వీరికి మరింత ప్రీతి. అందుకే కాబోలు భీమవరం కాలేజీకి ఆరు ఎకరముల భూమిని దానం చేశారు. జానపద కళారూపాలన్నా సాహిత్యమన్నా గన్నాబత్తుల నారాయణమూర్తి గార్కి వున్న అభిమానం చూస్తే ఆంధ్రుడైన ప్రతివాడు గర్వించవలసిందే. పండితపామరులనే వ్యత్యాసాన్ని అణుమాత్రం దృష్టిపథంలోకి రాకుండా అశేష ప్రజల ఆనందానికి ఆత్మ వికాసానికి దోహదమిచ్చే జానపద కళారూపాల ఔన్నత్యానికై నిర్విరామంగా కృషిసల్పుచున్న సహృదయులు. మృదుమధురమగు జానపద సంపదను పెంచి పోషించుటలో సిద్ధహస్తులు. అట్టడుగున నున్న అనన్య జానపద కళారూపాలను ఆరాధిస్తూ నేటికి ప్రజలకు సేవచేస్తున్న కళాకారులకు పుష్టినితుష్టిని కలుగచేయాలన్న కాంక్షతో నేడు జానపద కళారూపాన్ని సన్మానించి చరిత్రలో నూతన శకం ప్రారంభింప చేసిన సత్పురుషులు. ఈ సన్మానమునకు గండపెండేరంబహూకరించే గన్నాబత్తుల సుబ్బారావు గారు అనే పెదతాత గార్ని కళాలోకం ఏనాటికి మరచిపోదు. రత్నమయమైన రాయలేలిన కాలంలో ప్రబంధ కవుల యుగంలో పెద్దనామాత్యులకే. గండపెండేరం స్వీకరించిన ఖ్యాతి దక్కింది. తిరిగి నేటికి యక్షగాన ప్రవీణ బుర్రకథ పితామహుడైన నాజరుగారికి గండపెండేరం బహుకరణ జరగటం చరిత్రలో అపూర్వ సంఘటనగా కళాలోకం భావిస్తుంది. జానపద కళా

సంపదను పెంపొందింప చేయుటలో కంకణం గట్టుకొన్న రసజ్ఞులకు కవిగాయకులకు కళాకారులకు ఈ సన్మానం నూతనోత్తేజాన్ని కలుగచేసి ప్రజా కళల పునర్వికాస యుగానికి నాందిగా బాటలు వేసిన పర్వదినమవుతుంది. అసమానశక్తిగలదయినా ఆదరణలేక మూలపడియున్న ప్రజల కళారూపమైన బుర్రకథకు ఈ సన్మానం పవిత్రమైన సుదినమవుతుంది. ఇలాంటి మహత్తర కార్యక్రమం తలపెట్టి విజయవంతం చేయుటకుగాను సన్మాన సంఘమును ఏర్పాటుచేసి చక్కని కృషి చేయుటలో నడుంగట్టిన గిన్నాబత్తుల సహోదరులు వారికి అండదండగా నిల్చి సహకరించిన పెద్దలకు పిన్నలకు సర్వేశ్వరుడు ఆయురారోగ్య భాగ్యములు ప్రసాదించుగాక.

# కనకాభిషేక గండపెండేర సన్మానోత్సవం

బుర్రకథాసామ్రాట్ శ్రీ నాజర్ సన్మానోత్సవ ఆహ్వానసంఘం గిన్నాబత్తుల నారాయణమూర్తిగారి అధ్యక్షతన ఏర్పడి, సన్మానోత్సవ కార్యక్రమం ఏర్పాట్లు పెద్దయెత్తున చేయించారు. రాష్ట్రవ్యాపితంగా నున్న సుప్రసిద్ధ కళాకారులకును, కవి గాయకులకును ఆహ్వానాలు పంపించారు. కవికులాలంకార వాఙ్మయోద్ధారక శ్రీ జవ్వాది లక్ష్మయ్య నాయుడు గారిని సభాధ్యక్షులుగను, కవి, కథక రత్న, హరికథాసుధాకర శ్రీ దీక్షిత భాగవతారుగారిని సభా ప్రారంభకులుగను ఆంధ్రజ్యోతి ఉపసంపాదకులు శ్రీ ఎల్లోరా గారిని, ఉగ్రశ్రీ, విద్వాన్ కొండూరి నరసింహం గారిని, కడలి వీరదాసుగారిని, ఆంధ్రపిర దాశి సూర్యనారాయణరాజుగారిని, కాజ వెంకన్నగారిని ఉపన్యా[illegible]లుగా సభకు ఆహ్వానించినారు. [illegible]వం ఉదయానికే ప్రసిద్ధ [illegible]రులు నితలా బ్రదర్సు, [illegible] భారతీ దళం, తాగూరు దళం, పెద్దలు, పిన్నలు, కవులు, గాయకులు ఆహ్వానసంఘం కార్యాలయానికి విచ్చేయటంతో భీమవరం పురప్రముఖులతోను, రాష్ట్రం నలుమూలలనుండి విచ్చేసిన కళాభిమానులతోను సన్మానసంఘ కార్యాలయం క్రిక్కిరిసిపోయింది. పరిసర ప్రాంతాల రైతుకూలీల ఉత్సాహం పెల్లుబికి 70 జతల ఎడ్లను ఊరేగింపుకై బారులుతీర్చి నిలబెట్టారు ఆరోజు.



అంటే ది 27-1-62 ఆంధ్ర జానపద కళా లక్ష్మికి మరుపురాని మహోన్నతమైన పర్వ దినం, ఆంధ్ర ప్రజల ఆనందోత్సవాలకు శుభ దినం. ప్రకృతి మేఘావృతమై చల్లని పిల్లగాడ్పు లతో పన్నీటిజల్లులను చిలకరించింది. పూలతో చక్కగా అలంకరించిన రథం సన్మానసంఘ కార్యాలయమునకు 70 జతల ఎడ్లను కట్టుకొని రాగానే కల్యాణిరాగం లో సొన్నాయి



మేళం తారస్థాయితో పలికింది. నగారా బాండుమేళాల సందడి, బాణసంచా కాల్పుల హడావుడి అశేషప్రజల జేజేలు దిక్కులు పిక్కటిల్లినవి. గన్నాబత్తుల సహోదరులు, కళాభిమానులు, కళాకారులు శ్రీ నాజరు గారిని పూలమాలలతో ముంచెత్తి వారి సహచరులైన సలాది భాస్కరరావుగారిని, చిన్నబ్బాయిగారిని రథారోహకులను గావించ టంతో ఊరేగింపు ప్రారంభమయింది. ఊరే గింపు ఒకవీథి దాటేసరికే మైలుపొడవు వరకు వ్యాపించింది. వాథలలోనున్న మేడలపైనుండి ముత్తైదువులు పుష్పవర్షం కురిపించారు.

సాయంత్రము 4 గంటలకు భీమవరం వర్తక సంఘ భవనం (సన్మానవేదిక) వద్దకు ఊరేగింపు రాగానే బాలబాలికా సంఘం స్వాగత సుమాంజలి సమర్పించి మంగళనీరాజనం సభాధ్యక్ష ప్రారంభకులను, ఉపన్యాస వేదికపై ఆసీనులను కమ్మని కోరగా వేదా శీస్సులు అందచేసిన తదుపరి బాలికలబృందం ప్రార్థనగావింప సన్మానసభ ప్రారంభమయింది.

దీక్షితదాసుగారు నాజరుగారిని అభినం దిస్తూ తాము రచించిన ఆశీస్సు లందజేసి సభను ప్రారంభిస్తూ కళాలక్ష్మి సేవ చేయటం అందరికి లభ్యమయేది కాదు. నటకుడుగాను, కవిగాను, గాయకుడుగాను పుట్టి పెరగటం అంతకన్నా అదృష్టం మరొకటి లేదన్నారు. ఎందుకంటె జీవితాసక్తతను పెంచి తాముగా చేయవల్సిన కార్యకలాపములకు వచ్చే వడు దుడుకులను అధిగమించి కర్తవ్యసాధనకు గాను ఉత్తేజపరచి ఉత్సాహమిచ్చే గాయ కులు లేకున్నా, విషయ వివరణకై వ్రాసిన మహాకవుల కావ్యాలు లేకున్నా, మన సం స్కృతి ఏమిటో మన మెవరమో తెలుసు కోలేని వారముకదా? తరతరాల జాతి ఔన్నత్యము తెల్సుకోవాలన్నప్పుడు సాహి త్యము కళలు అందుకు ప్రత్యక్ష నిదర్శన ములు. జాతి నుత్తేజపరచి భావితరాలకు బాటలు చూపిన ప్రబోధాలను నృత్తనృత్య నాట్యరూపములతో గానంచేసిన గాయకులే జాతికి వెలలేని [illegible]లు. ఇలాంటి అపూర్వ [illegible] ఖ్యాతి అపార మైనది [illegible] మైన దేశీ [illegible] లతో వికసింప [illegible] గట్టి